**Islam - ki - Taalim**
(Telugu)

# ఇస్లాం శిక్షణ

మూలం :

అబూ సలీమ్ అబ్దుల్ హై

అనువాదం :

అబుల్ ఇరాఫ్

# విషయ సూచిక

# తొలి పలుకు

ఈ పుస్తకంలో అత్యంత సులభమయిన శైలిలో ఇస్లామ్ విశ్వాసాలు, నిత్యజీవితంలో పనికివచ్చే కొన్ని ధార్మిక నియమాలు వ్రాయబడ్డాయి. పెద్ద పెద్ద గ్రంథాలను చదవలేని వారు ఈ పుస్తకం సహాయంతో ఇస్లాంకు సంబంధించిన ముఖ్యవిషయాలు తెలుసుకోవచ్చు. సాధారణ భాషాజ్ఞానం గల ముస్లిములందరికి దైవం దయతలిస్తే ఈ పుస్తకం ఎంతో ప్రయోజనకారి కాగలదని ఆశిస్తున్నాం.

ఇస్లామ్ శిక్షణ అంతా దివ్యఖుర్‌ఆన్, హదీసుల గ్రంథాల మీద ఆధారపడి ఉంటుంది. కాని ప్రతి నియమం సరాసరి ఖుర్‌ఆన్, హదీసుల నుండి గ్రహించటం అందరికీ సాధ్యపడదు. ఈ పని కొందరు షరీఅత్ వేత్తలు చేసి, ప్రజలందరికీ సులభంగా అందుబాటులో ఉండేటట్లు ధార్మిక నియమాలను విపులంగా చూపెట్టారు. ఈ విషయంలో నలుగురు షరీఅత్ వేత్తల నాయకులు చాలా ఖ్యాతి గడించారు:-

(1) ఇమామ్ అబూహనీఫా (రహ్మలై)

(2) ఇమామ్ మాలిక్ (రహ్మలై)

(3) ఇమామ్ షాఫయీ (రహ్మలై)

(4) ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై)

వీరందరిపై దైవానుగ్రహం కలుగు గాక!

ఈ నల్గురు మహనీయులు ఏది వ్రాసినా అది ఖుర్‌ఆన్, హదీసుల నుండే గ్రహించి వ్రాశారు. అయితే ఏదైనా ఒక విషయాన్ని గురించి వేర్వేరు

మనుషులు అర్థం చేసుకోటానికి ప్రయత్నించినపుడు, వారి అవగాహనల్లో ఎక్కడో ఒక చోట కొద్దో, గొప్పో భేదం వస్తుందనే విషయం అందరికీ తెలుసు. ఈ మహాపురుషులు రాసినదంతా చిత్తశుద్ధితో ఖుర్ఆన్, హదీసుల వెలుగులో వ్రాసిందే. అంచేత ముస్లిమ్‌లందరూ ఈ నల్గురు తెలిపిన విషయాలు సరయినవిగానే భావిస్తున్నారు. కాని నిత్య జీవిత వ్యవహారాల్లో అనుసరించడానికి మనం ఎవరో ఒకరి మాటనే స్వీకరించగలం, అందువల్ల సాధారణంగా ముస్లిమ్‌లు ఈ నలుగురిలో ఎవరినో ఒకర్ని అనుసరిస్తుంటారు.

ఖుర్ఆన్, హదీసులు సమగ్రంగా తెలిసినవారు ఆ నలుగురిలో ఎవరి మాటనూ అనుసరించవలసిన అవసరంలేదని, తామే స్వయంగా ఖుర్ఆన్, హదీసులు ముందుంచుకొని ఏం చేయాలో నిర్ణయించుకోవచ్చు అని చెప్పే ముస్లిమ్‌లు కూడా కొందరున్నారు. వీరిని "అహ్‌లె హదీస్" అనంటారు. వీరి మాట కూడా తప్పుకాదు. నిజానికి ఖుర్ఆన్, హదీసుల ద్వారా సరాసరి సర్వ విషయాలు తెలుసుకోగలవారు ఎవరయినా ఉంటే, వారు ఎవరో ఒక ప్రత్యేక వ్యక్తిచూపిన విధానాలను అనుసరించవలసిన పని లేదు. కాని అటువంటి జ్ఞాన సంపన్నులు ఎంత మంది ఉంటారో ఆలోచించండి. ఏదో కొద్దిగొప్ప చదువుకున్న ముస్లిములు ఎవరో ఒక షరీఅత్‌వేత్తపై ఆధారపడవలసిందే కదా!

ఈ విషయం మీకు ఎందుకు తెలియజేస్తున్నానంటే, హజ్రత్ ఇమామ్ అబూహనీఫా (రహ్మాలై), ఆయన అనుచరులు తెలిపిన పద్ధతులు ఈ పుస్తకంలో వివరించబడ్డాయి. ఇవి అనేక విషయాల్లో ఇతర ఇమామ్‌లు చూపిన పద్ధతులకు కొంచెం భిన్నంగా ఉన్నాయని మున్ముందు మీరే గ్రహిస్తారు.

అటువంటి విషయం ఏదైనా మీ గుర్తులోకి వస్తే మీరు దాన్ని ఖండించకండి. బహుశా అది కూడా ఎవరో ఒక ఇమామ్ లేక షరీఅత్‌వేత్త ఖుర్ఆన్ హదీసుల వెలుగులోనే గ్రహించి ఉండవచ్చు. ఎవరో ఒక ఇమామ్ విధానాన్ని అనుసరించే అధికారం మీకు ఉంది. కాని ఇతరుల విధానం తప్పని చెప్పటం మీకు ఏ మాత్రం భావ్యం కాదు. నలుగురు ఇమాముల విధానాలను అనుసరించేవారూ, ఖుర్ఆన్, హదీసుల నుండి సరాసరి ధర్మాన్ని తెలుసుకునే "అహ్‌లె హదీస్" సోదరులూ అందరూ సన్మార్గాన్ని అనుసరించే వారే! వారిలో ఎవరో ఒక్కరె సన్మార్గగాములని, మిగిలిన వారంతా సన్మార్గాన లేరని అనటం సమంజసం కాదు. ఇలాంటి విషయంలో అవివేకులు, కలహప్రియులు తరచుగా పోట్లాడుకుంటూ ఉంటారు. మీరు అలాంటి జగడాలన్నింటికి దూరంగా ఉండండి.

షవ్వాల్ 2, హి|జీ 1375

– అబూసలీమ్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# దేవుడు ఒక్కడే

వేలాది ప్రయాణీకులను ఒక స్థలం నుండి మరొక స్థలానికి తీసుకొనిపోయే రైలుబండి, ఎవరూ తయారుచేయకుండానే దానంతటదే తయారయిందని, దాని ఇష్టానుసారంగా అది నడుస్తోందని, అది కోరినప్పుడు ఆగుతుందని, కోరినప్పుడు నడుస్తుందని, ఎవరైనా చెబితే మీరు నమ్ముతారా? రైలుబండిని తయారుచేసే వాణ్ణి చూచి ఉండక పోయినా, దాన్ని నడిపేవాడు ఎదురుగా లేకున్నా, రైలుబండి దానం తటదే తయారయిందని, నడిపేవాడు లేకుండానే అది నడుస్తోందని మీరు నమ్మరు కదా!

రైలంటే చాలా పెద్దవస్తువు. కాని కుర్చీ, కలం, ఇల్లు, ఇంకా అలాంటివి ఎన్నో ఇతర వస్తువులు వాటంతటవే తయారయినవని, లేక తయారు కాగలవని కూడా మీరు అంగీకరించరు. ఏదైనా వస్తువు ఎవరూ తయారు చేయకుండానే దానంతటదే తయారవుతుందనే విషయం నాకర్థం కావటంలేదని, అసలు నేనిలాంటి మాటలు నమ్మలేనని మీరే అంటారు.

ఒకసారి ఈ విశ్వాన్ని చూడండి. మనం నివసిస్తున్న ఈ భూమి, ఈ భూమండలంపై వెలుగును విరజిమ్మే సూర్యచంద్రులు, ఆకాశంలో మెరిసే కోటానుకోట్ల నక్షత్రాలు, గాలి, సముద్రం, జంతువులు పక్షులు, మానవులు చివరికి నేనూ, మీరూ ఇదంతా దానంతట అదే ఉనికిలోకి వచ్చిందా? ఎవరయినా ఇలాంటి విషయాలు చెబితే మీరు నమ్ముతారా?

కుర్చీ, ఇల్లు, మట్టిపాత్ర చదువుకునే పుస్తకం, రాసుకునే కలం వంటి చిన్న వస్తువులే వాటంతటవి తయారు కాజాలనప్పుడు, ప్రకృతిలోని బ్రహ్మాండమైన వస్తువులు తయారుచేసే వాడెవడూ లేకుండానే వాటంతటవి ఎలా తయారు కాగలవు? ఇలాంటి మాటలు పలకటం శుద్ధ అవివేకం అని మీరే అంటారు.

సూర్య మండలం మన భూమి కంటే కొన్ని వేల రెట్లు పెద్దది. దానికంటే కూడా వందల రెట్లు పెద్దవిగా ఉండే ఇతర గ్రహాలు ఈ విశ్వాంతరాళంలో ఇంకా ఎన్ని ఉన్నాయో చెప్పలేం. ఆకాశంలో చంద్రుడు, కోట్లకొలది పెద్ద పెద్ద నక్షత్రాలు ఉన్నాయి. అవన్నీ తమ నిర్ణీత కక్ష్యల్లోనే తిరుగుతున్నాయి. వాటిలో ఏ ఒక్కటీ నిర్ణీత కక్ష్యవదలి రెండవదాంతో ఢీకొనజాలదు. చివరికి వెంట్రుకవాసి పరిమాణంలో కూడా పక్కకు తొలగిపోలేదు. సూర్యుడు తన నిర్ణీత సమయానికి ఉదయిస్తున్నాడు, నిర్ణీత సమయానికే అస్తమిస్తున్నాడు. చంద్రుడు తాను తిరుగుతున్న మార్గాన్నుంచి ఎన్నటికీ తొలగడు. సూర్యరశ్మి సముద్రపు నీటిని ఆవిరిగా మార్చివేస్తోంది. ఈ ఆవిరిని గాలులు తీసుకొని ముందుకు గొంపోతాయి. నిర్ణీత సమయానికి, ఈ ఆవిరి తిరిగి నీరుగా వర్షిస్తుంది. సూర్యుడు తన ఉష్ణాన్ని ప్రసరింపజేయకుండా ఆపడంగాని, నీరు ఆవిరిగా మారటానికి ఇష్టపడకపోవటం గాని, గాలులు తమ కర్తవ్యాన్ని మానటంగాని ఎన్నటికీ జరగదు. ఆయా వస్తువులు వాటికి నిర్ణయింపబడిన విధుల్ని సక్రమంగా నెరవేరుస్తూనే ఉన్నాయి.

వర్షం మన జీవనాధారం. వర్షం కురియగానే భూమి నుండి రకరకాల ధాన్యం, ఇంకా ఇతర మొక్కలు పుట్టుకొస్తున్నాయి. వాటి వల్ల ఎన్నో జీవరాసులు పోషణ పొందుతున్నాయి. వర్షం కురవకపోతే కొద్ది రోజుల్లోనే నేల బీడు పడుతుంది; పశుపక్ష్యాదులు కానరావు; మానవులు కూడా జీవించలేరు.

ఇప్పుడు మనం యోచించవలసిన విషయం- ప్రపంచం అనే ఈ కర్మాగారం యావత్తు దానంతటదే నడుస్తుందా? దీన్ని నడిపేవాడు, సంరక్షించేవాడు ఎవడూ లేడా? ఇలా ఎన్నటికీ కాజాలదు. ఈ ప్రపంచాన్ని సృష్టించినవాడు ఒకడున్నాడు. ఆయనే దీన్ని కాపాడుతూ ఉన్నాడు. ఆయనే దైవం. ఆయనే అన్నిటినీ సృష్టించేవాడు, ఆయన ఆజ్ఞానుసారమే ఈ ప్రపంచ కర్మాగారం నడుస్తోంది. ఇక్కడ ఏది జరుగుతున్నా ఆయన ఇష్టానుసారమే జరుగుతోంది. ఏ వస్తువైనా దానంతటదే ఉనికిలోకి రాలేదు. అలాగే ఏ పనీ దానంతటదే జరగటంలేదు.

ఒక్కసారి మిమ్మల్ని మీరు చూసుకోండి. మీకు ఎంతటి అందమైన శరీరం ఉందో, ఆ శరీరంలో ఎలాంటి శక్తి సామర్థ్యాలున్నాయో చూడండి. మీరు మాట్లాడుతున్నారంటే శబ్దం ఉత్పత్తి అయ్యే విధంగా మీరు నాలుక, పెదవులు, గొంతునాడులను కదలిస్తున్నారన్నమాట. మీరు కోరిన విధంగా ఆ శబ్దానికి మాటల రూపునిస్తున్నారు. ఆ మాటలకు అర్థం ఉంది. మీరు మాటల ద్వారా మీ మనస్సులోని భావాన్ని ఇతరులకు తెలియజేస్తున్నారు. ఈ పని ప్రతి వ్యక్తీ చేయగల్గుతున్నాడు. ఎలాంటి కష్టం లేకుండా సునాయాసంగానే చేస్తున్నాడు. అంచేత ఈ మాట్లాడటం లేక పదాలను ఉచ్చరించటం అనేది ఎంత గొప్ప విషయమో మీరు యోచించరు. మీరు మాట్లాడలేని మూగవారిని కూడా చూచి ఉంటారు. వారు పుట్టుకతోనే మూగవారై ఉంటారు. మూగవాళ్ళు మాట్లాడటానికి సహాయపడే యంత్రాన్ని ఇంతవరకూ మానవుడు కనిపెట్టలేకపోయాడు.

మీరు వింటున్నారు; అంటే, మనుషుల మాటలు, జంతువుల అరుపులు, పక్షుల కీచురావాలు, ఇతర విధంగా పుట్టే శబ్దాలన్నింటివల్ల గాలిలో అలలు ఏర్పడి అవి మీ చెవులతో ఢీకొంటున్నాయి. అప్పుడు ఎవరు ఏం మాట్లాడుతున్నారో, ఏ జంతువు అరుస్తున్నదో, ఏ పక్షి

కూస్తున్నదో, ఏ వాయిద్యం మోగుతుందో లేక ఏ విధమైన శబ్దం అవుతుందో మీకు తెలుస్తుంది. ఈ విధంగా మీరు వినగలగటం ఇంత వరకు ఏ విజ్ఞాన శాస్త్రవేత్తకు కూడా అంతుపట్టని విషయం. అసలు గాలిలో ఏర్పడే తరంగాలవల్ల మనిషికి అది ఫలానా శబ్దమని ఎలా తెలిసిపోతుంది? అన్నది గొప్పప్రశ్న! వినలేని వారిని కూడా మీరు చూచివుంటారు. వారిలో కొందరు పుట్టుకతోనే చెవిటివాళ్ళు. మరికొందరు తరువాత చెవిటివాళ్ళయిన వారు. పూర్తి చెవిటివారు వినగలగటానికి పనికి వచ్చే సాధనం మానవుడు ఇంతవరకు కనిపెట్టలేకపోయాడు. అలాగే మీరు చూడటం, వాసన గ్రహించటం, అంతకంటే గొప్ప విషయాలైన ఆలోచిం చటం, అర్థం చేసుకోవటం ఇవన్నీ ఎంతటి అద్భుతాలంటే అలాంటి వాటిని ఈనాటి వరకూ ఎవరూ సాధించలేదు; ఇక ముందు సాధించగలరన్న ఆశకూడా లేదు. మూగవాడు మాట్లాడేటట్లు, చెవిటివాడు వినేటట్లు, గుడ్డివాడు చూసేటట్లు చేయగలశక్తి మానవుని అధీనంలో లేదు.

అయితే ఒక విషయం ఆలోచిద్దాం. మాట్లాడగలిగే, వినగలిగే, చూడగలిగే, బుద్ధీ వివేకాలు కలవాడు, అత్యంత అద్భుత కార్యాలు సాధించగలిగే ఈ మానవుడు తనంతటతానే పుట్టాడా? కాదు. అతని శరీరంలోని అణువణువు, అతన్ని ఓ గొప్ప ఇంజనీరు, తిరుగులేని మేధగల ఇంజనీరు తయారుచేశాడని ఎలుగెత్తి చాటుతోంది. మానవుడు తల్లి గర్భంలో తయారవుతాడన్న విషయం మనకందరికీ తెలిసిందే. అయితే మానవుడు తయారయ్యే ఈ ఫ్యాక్టరీలో తల్లికి ఏదైనా అధికారం ఉందా? మానవుణ్ణి తల్లే సృష్టిస్తుందని మనం చెప్పగలమా? పోనీ తండ్రి మానవుణ్ణి సృష్టించే ఇంజనీరా? అదీ కాదు. అలా ఎన్నటికీ కాదు. మానవుణ్ణి తయారు చేసేది తల్లిదండ్రులు కాదు. ఒక చిన్నతిత్తిలో మనకంటికైనా కనిపించని సూక్ష్మజీవులు రెండు ఒకదాంతో ఒకటి కలుసుకుంటాయి.

తల్లి రక్తంలో నుంచి వాటికి ఆహారం సరఫరా అవుతుంది. మనిషి నిర్మాణానికి కావలసిన సమస్త వస్తువులు ఆ రక్తంలో నుంచే లభిస్తాయి. మరి వీటన్నిటినీ గర్భంలో ఉన్న పిండానికి అందించేది తల్లియా? గర్భమనే ఈ ఫ్యాక్టరీలో తయారయ్యే మనిషికి ఏదికావాలో అవి ఎలా సరఫరా చెయ్యాలో అనే విషయం కూడా ఆ అమాయక జీవికి తెలియదు. తల్లి తీసుకునే ఆహార పానీయాల నుండి కావలసిన పదార్థాల సేకరణ జరిగి రక్తం రూపంలో పిండానికి అందుతాయి. తత్ఫలితంగా క్రమేణా మానవ శరీరం నిర్మాణమవుతుంది. ఈ పని తల్లి చేస్తుందని ఎవరైనా అనగలరా?

కొన్ని రోజుల్లోనే పిండం మాంసపు ముద్దలా తయారవుతుంది. ఆ పిండంలో కళ్ళు ఉండాల్సినచోట కళ్ళు, చెవులు వుండాల్సిన చోట చెవులు ఏర్పడుతాయి. అలాగే హృదయం, ఊపిరితిత్తులు, రక్తనాళాలు, ఆలోచించే మెదడు, ఇంకా మానవ నిర్మాణానికి కావలసిన ఇతర సమస్త వస్తువులు ఏర్పడుతాయి. అందులో ప్రాణం కూడా పడుతుంది. చూడటానికి వినటానికి అవసరమయిన శక్తి జనిస్తుంది. తొమ్మిది నెలల నుంచి మానవునిగా తయారు చేస్తున్న ఆ ఫ్యాక్టరీ ఇప్పుడతన్ని బయటకు నెట్టివేస్తుంది. బయటికి రాగానే ఊపిరి తిత్తులు తమ పనిని ప్రారంభిస్తాయి. ఈ దుర్బల మానవ శరీరం వెలుపలిగాలి ద్వారా మరియు ఇతర వస్తువుల ద్వారా శక్తిని గ్రహించ ప్రారంభిస్తుంది. ఈ పాప కోసం తల్లి స్తనాలలో ముందే పాలు సిద్ధపరచి ఉంటాయి. ఈ పాలను తల్లి తయారుచేయటం లేదని మీకు తెలుసు. ఈవిధంగా ప్రతిరోజూ లక్షల కొలది మానవులు జన్మిస్తున్నారు. వారిలో ప్రతి ఒక్కరి రూపురేఖలు వేర్వేరుగా ఉంటున్నాయి. అందచందాలలో తేడావుంది. కొందరిలో తెలివితేటలు ఎక్కువగా, మరి కొందరిలో తక్కువగా ఉంటున్నాయి. కొందరిలో కొన్నిశక్తులు ఎక్కువగా ఉంటే మరి కొందరిలో అవి తక్కువగా ఉంటాయి.

ప్రతి ఒక్కరి స్వభావం ఆలోచనలు, శక్తి సామర్థ్యాలు వేర్వేరుగా ఉంటాయి. ఈ విషయాన్ని గురించి ఎంత ఆలోచిస్తే మీరు అంతే ఆశ్చర్యపోతారు. ఈ అద్భుత కార్యాలన్నీ గొప్పశక్తిమంతుడైన ఇంజనీరు ఒకడు లేకుండా జరగవని మీ అంతరాత్మ ఘోషిస్తుంది. ఆయనే దైవం. ఆయనే అన్నిటినీ సృష్టించేవాడు. ఆయన తప్ప ఇతరులకెవరికీ ఒక్క అణువయినా సృష్టించే శక్తిలేదు.

సరే, ఇప్పుడు మరో విషయాన్ని గురించి ఆలోచిద్దాం. ఏదైనా ఒక పని చిన్నదైనా పెద్దదైనా దాన్ని పూర్తిచేసే బాధ్యత ఎవరో ఒక వ్యక్తికి ఒప్పచెప్పినపుడే అది సక్రమంగా నెరవేరగలదని మీకు తెలుసుకదా? ఒక కార్యాలయంలో ఇద్దరు అధికారులు, ఒక రాష్ట్రానికి ఇద్దరు గవర్నర్లు, ఒక రాజ్యానికి ఇద్దరు రాజులు, ఒక దేశంలో ఇద్దరు ప్రధానమంత్రులు ఉండటం మీరెప్పుడయినా విన్నారా? ఒకవేళ అలా ఉంటే మాత్రం అక్కడి పనులు ఎప్పటికీ సజావుగా సాగవు. కనుక ప్రతిపనికీ పూర్తి బాధ్యత వహించేవాడు ఒక్కడే ఉండాలని నిర్వివాదాంశం.

మనచుట్టూ ఉన్న ఈ సువిశాల విశ్వం, దాని పనులు, అది పని చేసే తీరు అంతా ఒక్కసారి చూడండి. మనం నివసిస్తున్న ఈ భూమిని చూడండి. ఆకాశం నుంచి వర్షం కురియటంతోనే దాని మీద విత్తనాలు మొలకెత్తుతున్నాయి. మొక్కల ఆహార సరఫరాకు తోడ్పడే అనేక పదార్థాలు భూమిలో ఉన్నాయి. వర్షం కురియటానికి సముద్రపు నీటిని ఆవిరిగా మార్చే సూర్యరశ్మి అవసరమని మీకు తెలుసు. ఆ ఆవిరిని ఒకచోట నుంచి మరోచోటికి గొనిపోవడానికి గాలి తోడ్పడుతుంది. మొక్కలు స్థిరపడటానికి కావలసినంత ఉష్ణం కూడా సూర్యుని నుండి లభిస్తుంది. దీనికి చంద్రుడు కూడా కొంచెం సహాయపడవలసి వస్తుంది. అంతేకాదు మొక్కలు స్థిరపడటానికి నేలలో ఉండే క్రిమికీటకాలు కూడా సహాయ పడుతున్నాయని ఇప్పుడు విజ్ఞానశాస్త్రవేత్తలు తెలియజేస్తున్నారు. ఇవి

గాలినుంచి నత్రజనిని గ్రహించి మొక్కలకు కావలసిన ఆహారం తయారు చేస్తున్నాయి. వస్తువులను కుళ్ళజేసి ఎరువుగా మార్చుతున్నాయి. ఆ ఎరువు నుండే మొక్కలకు ఆహారం లభిస్తుంది. కనుక ఒక విత్తనం స్థిరపడటానికి, ఒక మొక్క పెరిగి పోషింపబడటానికి సూర్యుడు, చంద్రుడు, గాలి, మేఘాలు, వర్షం మొదలుకొని నేలలో ఉండే లక్షలాది క్రిమికీటకాల వరకు ఇంకా ఎన్నెన్నో శక్తులు పనిచేస్తేగాని మొక్క పెరగటంలేదు. ఇవన్నీ ఎవరో ఒక వ్యక్తి ఆదేశంపై తమతమ పనుల్లో నిమగ్నమై ఉన్నాయా అన్నట్లు నియమిత సమయానుసారం పనిచేస్తున్నాయి.

ఆకాశంకేసి చూడండి. సూర్యుడు ఒక నిర్ణీత పద్ధతి ననుసరించి పనిచేస్తున్నాడు. రాత్రీ, పగలు తమ నిర్ణీత సమయాలకు ముందుగా రావటం సంభవించటంలేదు. వేసవిగా ఉండవలసిన కాలం శీతాకాలంగాను, శీతాకాలంగా ఉండవలసిన కాలం వేసవికాలం గాను మారటంలేదు. చంద్రుణ్ణి చూడండి. దాని పరిభ్రమణంలో కూడా ఎప్పుడూ మార్పులేదు. ఏఏ రోజుల్లో దాని చంద్రకళలు ఎలా ఉండాలో అవి అలాగే ఉంటున్నాయి. పూర్తినెల కాక ముందే పదిహేను లేక ఇరవై రోజుల్లోనే నెలవంక కన్పించటం ఎన్నటికీ జరగదు. ఒక్క సూర్య చంద్రులేమిటి? ఆకాశంలో ఉండే కోటాను కోట్ల నక్షత్రాలు తమతమ నియమిత పద్ధతులననుసారం పరిభ్రమిస్తున్నాయి. అవి ఒకదాంతో ఒకటి ఢీకొనడం ఎప్పుడూ సంభవించటంలేదు. అవన్నీ ఒక యంత్రంలోని భాగాలవలె తమ తమ విధి నిర్వహణలో నిమగ్నమయి ఉన్నట్లు తెలుస్తోంది. వాటిలో ఏ ఒక్కటీ తన నియమాన్ని మార్చుకోవటం లేదు. చివరకు అవి తన కక్ష్యనుండి వెంట్రుకవాసి కూడా తొలగటం లేదు.

ఇప్పుడు మనం ఒక విషయం గమనిద్దాం. నేల నుండి విత్తనం మొలకెత్తటానికి తోడ్పడే వివిధ ప్రకృతి శక్తులు ఒకదాంతో ఒకటి కలసి

సంఘీభావంగా పనిచేయడానికి నియమబద్ధమయి ఉన్నాయి కదా? కారణం ఏమిటి? గాలి, నీరు, సూర్యుడు, చంద్రుడు లేక ఇతర ఏ ప్రకృతి శక్తుల్లోనైనా ఒకటి మిగిలిన వాటితో సహకరించకపోవడం, తత్ఫలితంగా నేలనుండి విత్తనం మొలకెత్తకపోవడం లేక గాలి తాను చేయవలసిన పనిని చేయనని నిరాకరించడం, నీరు మట్టితో సహకరించి చేయవలసిన పనికి బదులు మరోపని చేయటం, సూర్యరశ్మి ధాన్యాన్ని పండేటట్లు చేసేపనిని వదలివేయటం, నేల విత్తనాన్ని స్థిరపరచి మొక్కకు ఆహారమిచ్చే పనిని చేయకుండటం ఎప్పుడూ సంభవించటంలేదు. కోట్లసంవత్సరాల నుండి ఇది ఇలాగే జరుగుతూ వస్తోంది. నీరు మండే పని చేయటం లేక అగ్ని శీతలం వుత్పత్తిచేయటం ఎప్పుడూ జరగలేదు. సృష్టిలోని సమస్త కార్యాలలో ఒక నిర్భేధ్యమయిన సంబంధం, సహకారం వుండటానికి, అందులో ఏ రోజు కూడా పొరపాటు రాకపోవటానికిగల కారణం ఏమిటి? ఈ ప్రశ్నకు మీరేమి సమాధానంఇవ్వగలరు? ఈ కార్యమంతా ఒకే ఒక ప్రభువు యజమాని సంజ్ఞల మీద జరుగుతోందని, ప్రపంచ వ్యవహార మంతటినీ ఒకే ఒక కర్త నడిపిస్తున్నాడనీ, దేవుడనే వాడొకడు న్నాడని, ఆయన ఆజ్ఞమేరకే ఇవన్నీ జరుగుతున్నాయనేకదా. ఒకవేళ ఈ సృష్టిలో ఒకరిని మించి కొంతమందికి అధికారం ఉంటే ఇక్కడి పనుల్లో ఇలాంటి సామరస్యం ఎన్నడూ గోచరించకపోయేది. చివరికి దేవుళ్ళు ఇద్దరున్నా ప్రపంచ వ్యవహారం తారుమారవుతుంది. ఒక సాధారణ కార్యాలయంలో లేక ఓ చిన్న రాజ్యంలో ఒకే విధమైన బాధ్యత వహించిన వారు ఒకరికంటే ఎక్కువమంది ఉంటే అక్కడి వ్యవహారమంతా తలక్రిందులవుతుంది. కనుక ఇంత పెద్ద విశ్వకార్యం కూడా ఇద్దరు దేవుళ్ళు ఉంటే సక్రమంగా సాగదు.

కొందరు, దేవుడు ఒక్కడే కాని, అనేకమంది ఇతర దేవతలు ఆయనకు సహాయం చేస్తూ ప్రపంచవ్యవహారం నడుపుతున్నారని అంటారు.

ఇది సరికాదు. ఏ ఒక్కరి సహాయ సహకారాల అవసరం లేనంతటి శక్తి కలిగిన వాడే దేవుడు. ఆయన స్వశక్తి సంపన్నుడయి సర్వశక్తి సంపన్నుడయి ఉండాలి. అందులో ఇతరులకు అధికారం చెలాయించే ఆస్కారం ఉండరాదు. దేవుడు తన రాజ్యంలో ఇతరులను తన భాగస్వాములుగా చేసుకోలేదు. ఆయన రాజ్యంలో ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా అధికారం కలిగి మసలుకొనే అవకాశం ఇతరులకు లేదు. ఇలాంటి విషయాలు నమ్మేవాళ్ళు చాలా మోసానికి గురి అయ్యారు. ఏ దేవుడు లేకుండానే ఈ విశ్వం ఏర్పడలేదన్న విషయం ఎంత వాస్తవమో, ఆ దేవుడు ఒక్కడే అని, ఆయనకెవరూ సాటిలేరనీ, ప్రపంచ వ్యవహార మంతా ఆయనే నడుతున్నాడని, ఆయనకు ఎవరి సహాయ సహకారాలు అవసరంలేదని, ఆయన తాను అనుకొన్నది చేయగలడని, చేస్తున్నాడని, ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా ఊపిరిసలపటానిక్కూడా ఇతరులకు శక్తిలేదనేది కూడా అంతే వాస్తవం.

★ ★ ★

# ముస్లిం, కాఫిర్

విశ్వమంతటినీ అల్లాహ్ సృష్టించాడు. ఆయనే ఈ విశ్వానికి యజమాని. ప్రపంచమందలి ప్రతివస్తువు యజమాని తనను ఏ పనికోసమైతే సృష్టించాడో ఆ పనిలోనే నిమగ్నమై ఉంది. ప్రతి దానికోసం దాని యజమాని కొన్ని నియమాలు, పద్ధతులు నిర్ణయించాడు. ఆ నియమాలను వెంట్రుకవాసి కూడా అవి అతిక్రమించలేవు. నీరు ప్రవహించటానికి, ఆవిరి అయి పైకిపోవటానికి, శీతలం సోకి గడ్డకట్టుకోడానికి నిర్ణయించిన నియమాలు ఏ మాత్రమూ మారవు. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు వాటికి విధించబడిన నియమాలను అనుసరించటం తప్ప వేరే గత్యంతరం లేదు. మొక్కలు పెరిగి పెద్దవి కావటానికి, వాటి యజమాని ఏర్పరచిన విధానాలకు విరుద్ధంగా ఏమీ కాజాలవు. ఈ విధంగా ప్రతి వస్తువుకు కొన్ని నియమాలు, నిబంధనలు నిర్ణయించబడ్డాయి. వాటిని వదిలేసి అవి తమ ఇష్టానుసారంగా ప్రవర్తించలేవు. సమస్త వస్తువులు తమను సృష్టించిన వానికి విధేయులై ఉండవలసిందే. సర్వమూ ఆయన శాసనాలకు బద్ధులై ఉండడం తప్ప వేరే మార్గంలేదు. అరబ్బీ భాషలో విధేయునికి "ముస్లిం" అంటారు. అందువల్ల సృష్టిలోని ప్రతివస్తువు కూడా ముస్లిమే అని చెప్పవచ్చు. అంటే తన యజమాని పట్ల విధేయత కలిగింది, దైవానికి ముస్లిం అయినది అని అర్థం.

అదే రీతితో మానవజీవితాన్ని గురించి ఆలోచించండి. మానవుడు

కూడా ఈ ప్రపంచంలో ఒక భాగమే. అతన్ని కూడా అల్లాహ్ సృష్టించాడు. అతని జననానికి, జీవన్మరణాలకూ కూడా ఓ నియమం వుంది. మానవుడు ఆ నియమం ప్రకారమే పుట్టి, పెరిగి. పెద్దవాడై మరణిస్తున్నాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా ఆ దేవుడు ఏర్పరచిన నియమానికే లోబడి వున్నాయి. అతని హృదయం, కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు సమస్తం ఆ నియమానుసారమే పనిచేస్తున్నాయి. కళ్ళతో వినటం, చెవులతో వాసన చూడటం మానవునికి సాధ్యపడదు. కళ్ళతో చూడటానికి దేవుడు ఏర్పచిన నియమాల్ని మానవుడు ఉల్లంఘించలేడు. ఊపిరి పీల్చకుండా జీవించటం లేక గాలికి బదులు చేపలా నీళ్ళలో ఉండి జీవించడం అతని వల్లకాదు.

ఈ విధంగా మానవుడు కూడా తన జీవితంలో ఓ పెద్ద భాగాన దేవుడు నియమించిన చట్టాలకు కట్టుబడి జీవిస్తున్నాడు, మరో మాటలో చెప్పాలంటే ప్రపంచంలోని ఇతర వస్తువుల్లా అతను కూడా ఓ ముస్లిమే. కాని మానవునికి, ప్రపంచంలోని ఇతర వస్తువులకు ఓ పెద్ద తేడా వుంది. దేవుడు మానవునికి తెలివితేటలు విచక్షణా జ్ఞానం ప్రసాదించాడు. అనేక విషయాల్లో దేవుడతనికి స్వేచ్ఛనిచ్చాడు. వాటిలో ఏ విషయాన్నైనా అతను కావాలనుకుంటే స్వీకరించవచ్చు లేక తిరస్కరించవచ్చు. అలాగే అతను కోరితే ఒక పనిని చేయవచ్చు లేక చేయకపోవచ్చు. అతను సన్మార్గం అవలంబించవచ్చు లేకపోతే దుర్మార్గం అవలంబించవచ్చు. దేవుడు ప్రసాదించిన శక్తిసామర్థ్యాలతో మంచి పనులు చేయవచ్చు. లేక వాటిని చెడుపనులకోసం కూడా వినియోగించవచ్చు. ఉదాహరణకు దేవుడు అతనికి మాట్లాడే అధికారం ఇచ్చాడు. ఇప్పుడతను దేవుడొసంగిన అధికారాన్ని వినియోగించి మంచిమాటలు పలకగలడు. అతను కోరితే చెడుమాటలు కూడా పలకగలడు. అలాగే కళ్ళు, చెవులు కాళ్ళు చేతులు

ఇంకా ఇతర అవయవాలన్నిటినీ ఉపయోగించి మంచి పనులు కూడా చేయవచ్చు కావాలనుకుంటే వాటిని చెడు పనుల్లో కూడా వినియో గించవచ్చు. అంటే అల్లాహ్ తనకు స్వేచ్ఛ ప్రసాదించిన జీవితపు ఈ రంగంలో తాను కోరితే అల్లాహ్ యొక్క ముస్లింగా - విధేయుడుగా ఉండవచ్చు లేక ముస్లింగా ఉండటానికి నిరాకరించనూవచ్చు.

మానవుడు జన్మించడం, మనుగడ సాగించడం అంతా దేవుడు నిర్మించిన నియమానుసారమే అని మీరు తెలుసుకున్నారు. ఈ విధంగా అతడు ఇష్టపడినా, ఇష్టపడకపోయినా దైవ నియమాలకు విధేయుడై బద్ధుడై మాత్రమే జీవించవలసి వస్తుంది. అంటే మరోవిధంగా అతను ముస్లింగా మాత్రమే జన్మిస్తున్నాడు, ఇంకా తనకు స్వేచ్ఛలేని పరిధుల్లో మట్టుకు ముస్లింగా ఉండటం తప్ప మార్గాంతరం లేదని చెప్పవచ్చు. కాని పుట్టిన తర్వాత అతని తల్లిదండ్రులు అతనికి దైవాజ్ఞానుసారం నడిచే మార్గం చూపుతున్నపుడు అతడు తన వివేకాన్ని ఉపయోగించి స్వాతంత్ర్యం ప్రసాదించబడిన జీవితరంగాల్లో కూడా దైవాజ్ఞలనే అనుసరించ టానికి తీర్మానించుకుంటే అప్పుడతను సంపూర్ణంగా ముస్లిం అవుతాడు. అలాగే తన తల్లిదండ్రులు ఈ మార్గం చూపకపోయినా, పెద్దవారయి ప్రతి విషయాన్ని తరచిచూచి, బుద్ధీ వివేకాలను ఉపయోగించి తన సృష్టికర్త ఆదేశానుసారం నడవాలని, ఆయన చూపిన పద్ధతులపై మనుగడ సాగించడమే సరైన జీవనమార్గం అని నిర్ణయించుకున్న వాళ్ళు కూడా సంపూర్ణ ముస్లింలే. అయితే దేవుడు చూపిన మార్గం అనుసరించటానికి ఇష్టపడక, ఆయన శాసనాన్ని త్రోసిపుచ్చి, జీవితంలో ఇతర విధానాన్ని అనుసరించే వారిని "కాఫిర్లు" అంటారు. కాఫిర్ అంటే తిరస్కరించేవాడు, కప్పిపుచ్చేవాడు అని అర్థం. వారిలో కొందరు మొదటి నుండే తప్పుడు శిక్షణపొందిన వారు గాని లేక బుద్ధినుపయోగించి యోచించే అవకాశమే

లేనివారుగాని ఉన్నారు. మరికొందరు, తమకు ఎవరూ ఇలాంటి విషయాలు తెలుపనందువల్ల పచ్చి అజ్ఞానులై తమ కోరికలకు దాసులవుతున్నారు. చెడుపనుల్లో పడిపోయి, చెడునడతలను అలవరుచుకుంటున్నారు. ఇలా వారి బుద్ధిపై తెరపడిపోయి వారికి దైవమార్గపు కాంతి కానరాదు. కొందరికి తమ తాత ముత్తాతల నడవడికంటే, కుటుంబ ఆచార వ్యవహారాలంటే ఎక్కువ మమకారం ఉంటుంది. అందుచేత కులం, కుటుంబం పట్ల పక్షపాత వైఖరి వల్ల వారు కొంచెమయినా ఆలోచించటానికి అవకాశం దొరకదు. వీరు బుద్ధినుపయోగించరు. ఇలాంటి వారంతా కాఫిర్లయి పోతున్నారు.

★ ★ ★

# దైవ ప్రవక్తలు

అల్లాహ్‌చే సృష్టించబడిన వస్తువులన్నీ అల్లాహ్ నియమం ప్రకారమే నడుస్తున్నాయని, సమస్తమూ ఆయన ఆజ్ఞానుసారమే ఆచరిస్తున్నాయని, అదే వాటికి సముచితమయిన మార్గమని మీరు తెలుసుకున్నారు. మానవుణ్ణికూడా అల్లాహ్‌యే సృష్టించాడు. ఆయనే మానవుని వాస్తవ యజమాని. అంచేత మానవుడు కూడా ఆయన ఆజ్ఞలను శిరసావహించాలి. అతను కూడా అల్లాహ్ చట్టంపైనే నడవాలి.

మానవునికి కొంతవరకు స్వాతంత్ర్యం ఇవ్వబడిందనీ, అతనా స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకొని తనకు ఇష్టమయిన మార్గం అవలంబించ గలుగుతున్నాడని కూడా మీరు తెలుసుకున్నారు. ఇక మానవుడు ఏ మార్గాన్ని అవలంబించాలి? ఏ మార్గం అవలంబించటం శ్రేయస్కరం? ఏ మార్గం అవలంబించి తన యజమాని అయిన అల్లాహ్‌ను మెప్పించ గలడు? ఈ మార్గాన్ని అతనికి ఎవరు తెలియజేయాలి? అనే విషయాలను గురించి తెలుసుకోవలసి ఉంది. దేవుని అభీష్టం ఏమిటనే విషయం మానవుడు తనంతట తాను నిర్ణయించుకోగలడా? నిర్ణయించుకోలేడు. అతనికి దేవుని అభీష్టం తెలుసుకునేంతటి బుద్ధిజ్ఞానాలు లేవు. అతడు తన కోరికలకు బానిస అయిపోతాడు. ఆలోచించండి. ఒకవేళ మానవుడే దేవుని అభీష్టం ఏమిటో నిర్ణయించ మొదలెడితే ఒక్కో మనిషి ఒక్కోవిధంగా నిర్ణయిస్తాడు అనేది సుస్పష్టం. అయితే మానవునికి తన యజమాని

అభీష్టం ఏమిటో, ఆయన ఏఏ విషయాలను మెచ్చుకుంటాడో ఎవరు తెలియజేయాలి? కొంచెం జాగ్రత్తగా ఆలోచిస్తే ఈ విషయాలన్నీ మానవునికి దేవుడే తెలియజేయాలని మీకే స్ఫురిస్తుంది. తన సేవకుడు ఏమిచేయాలో ఏమి చేయకూడదో, యజమాని అతనికి తెలియజేయ నంతవరకు, ఆ సేవకుడు తన యజమాని అభీష్టం ఏమిటో ఎలా తెలుసుకోగలడు? తెలుసుకోలేడు. అంచేత తన ప్రసన్నత అభీష్టాలు ఏమిటో ఎలా తెలుసుకోగలడు? తెలుసుకోలేడు. అంచేత ప్రసన్నత అభీష్టాలు ఏమిటో మానవునికి తెలియజేయటం దేవుని విధి.

## తొలి మానవుడు ముస్లిం

అల్లాహ్ ఎంతో దయామయుడు. ఆయన ఎంతో కృపతో తనకు ఏది ఇష్టమో, ఏది అయిష్టమో మానవునికి తెలియజేశాడు. మొట్టమొదట ఆయన భూమ్మీద మానవుణ్ణి సృష్టించినప్పుడు తొలి మానవుడయిన హజ్రత్ ఆదం అలైహిస్సలాంకు ఈ విషయాలన్నీ తెలియజేశాడు. హజ్రత్ ఆదం (అస్సలాం) ఈ విషయాలను తన సంతానానికి తెలియపర్చారు. ఈ విధంగా మనిషి ప్రారంభంలో భూమ్మీద నివసించడం ప్రారంభించి నపుడు అతనికి, తన నిజప్రభువు అసలు సంరక్షకుడు అల్లాహ్ అని, ఆయన ఆదేశాలకనుగుణంగానే తాను జీవించాలనే విషయాలు పూర్తిగా తెలుసు. అల్లాహ్‌కు ఏ విషయాలు ఇష్టమో, ఏవి అయిష్టమో అన్న విషయాలు కూడా అతనికి పూర్తిగా తెలుసు.

హజ్రత్ ఆదం (అస్సలాం) తర్వాత కొంతకాలానికి మానవుడు ఈ విషయాలను మరచిపోసాగాడు. ఆఖరికి ఒకానొకప్పుడు అతను అనేక విషయాలు మరచిపోయాడు. అప్పుడు దేవుడు మళ్ళీ తన మరో ప్రత్యేక సేవకునికి హజ్రత్ ఆదం (అస్సలాం)కు ఇచ్చినటువంటి జ్ఞానమే ఇచ్చి పంపాడు. ఆయన పేరు హజ్రత్ నూహ్ (అలైహిస్సలాం). ఆయన మరచి

పోయిన విషయాలన్నిటిని తిరిగి మానవులకు నేర్పారు. ఇలా మానవుడు మళ్ళీ అంధకారంలో నుంచి వెలుగులోకి వచ్చాడు.

మరి కొంతకాలం గడచిన తర్వాత మానవుడు మళ్ళీ ఆ విషయాలను మరచిపోయాడు. అప్పుడు దేవుడు తన అపారకృపతో తన మరో ప్రత్యేక సేవకుణ్ణి పుట్టించాడు. ఆయన మళ్ళీ మానవులకు దైవ ప్రసన్నతా మార్గం తెలిపాడు. దేవుని యొక్క ఈ పుణ్యసేవకులను దైవ సందేశహరులంటారు, వీరిని పైగంబరులని, ప్రవక్తలని కూడా పిలుస్తారు.

## ప్రవక్తలు అనేకసార్లు వచ్చారు

దైవప్రవక్తలు ప్రతియుగంలోనూ ప్రభవిస్తూ వచ్చారు. దైవదాసులకు దైవప్రసన్నత పొందే మార్గాన్ని చూపిస్తూ వచ్చారు. ఆ ప్రవక్తల బోధలను పాటించి అల్లాహ్‌నే తమ యజమాని అని విశ్వసించి ఆయన ఆజ్ఞానుసారం జీవితం గడిపినవారంతా ముస్లింలు. ఈ ప్రవక్తలు ప్రతికాలంలో ప్రతిదేశానికి వచ్చారు. వీరు దేవుని దాసులకు దైవప్రసన్నత పొందేమార్గాన్ని చూపారు. దైవప్రవక్తలందరూ సత్యవంతులు, ప్రజలకు వారు చూపిన మార్గం సత్యమైనది. దాన్నే దైవధర్మం అంటారు, దాని పేరే ఇస్లాం.

## చివరి ప్రవక్త

తాను పంపిన జీవన విధానాన్ని మానవుడు ప్రపంచమంతా వ్యాపింప జేయగల స్థితికి రానంతవరకు, తాను బోధించిన విషయాలను మనిషి కోల్పోతాడన్న ప్రమాదం ఉన్నంతవరకు, అల్లాహ్ మాటిమాటికి తన ప్రవక్తలను పంపుతూ మానవులకు తన మార్గాన్ని (ధర్మాన్ని) తెలుపుతూనే వచ్చాడు. మానవుడు ప్రవక్తలు తెలిపిన విషయాలను ప్రపంచమంతా వ్యాపింపజేయగలిగి ప్రపంచంలోని ప్రజలందరికీ దైవ ధర్మం అందించగల స్థితికి వచ్చిన తర్వాత దేవుడు తన చివరి ప్రవక్త హజ్రత్ ముహమ్మద్

సల్లల్లాహు అలైహి వ సల్లంను ప్రభవింపజేశాడు. ఆయన దైవ ధర్మాన్ని పూర్తిగా ప్రజలకు బోధించారు. ఏ విషయాలను ఆచరిస్తే దైవ ప్రసన్నత పొందవచ్చో, మరే విషయాలను ఆచరిస్తే దైవానికి అయిష్టమో ఆ విషయాలన్నీ ఆయన వారికి తెలిపారు.

అంతిమ దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్(సఅసం) దాదాపు 1400 సంవత్సరాల క్రితం అరేబియాదేశంలోని మక్కాపట్టణంలో జన్మించారు. నలభై సంవత్సరాల వయస్సుకాగానే అల్లాహ్ ఆయన్ని తన ప్రవక్తగా నియమించాడు. దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) దగ్గరకు దైవదూత హజ్రత్ జిబ్రీల్ (అస్సలాం) తరచుగా వచ్చి ఆయనకు దైవ సందేశాలను అందజేసేవారు. ఈ సందేశాల కూర్పునే దివ్యఖుర్ఆన్ అంటారు. ఇందులో ఉన్న సమస్త విషయాలు దైవప్రోక్తాలే. వీటిలో ఏ మానవుడు కల్పించిన ఏ ఒక్క విషయమూ లేదు. అందువల్ల దివ్యఖుర్ఆన్‌ను దైవదత్తగ్రంథం అంటారు.

హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లంకు పూర్వం కూడా అనేక ప్రవక్తలు వచ్చారని దైవమార్గం అయిన ఇస్లాంనే ప్రజలకు బోధించారని మీరింతకు ముందే తెలుసుకున్నారు. ఈ ప్రవక్తలంతా సత్యసంధులు, వారు బోధించిన దైవమార్గం కూడా సత్యమైనదే. కాని ప్రజలు దైవ ధర్మాన్ని విస్మరించి అందులో తమ ఇష్టానుసారం అనేక మార్పులు చేర్పులు చేసేశారు. అప్పుడు దేవుడు మరో ప్రవక్తను ప్రభవింపజేశాడు. ఆ ప్రవక్త కూడా ప్రజలకు ఇస్లాంను గురించే బోధించారు. అంచేతనే ఏదో ఒక దైవప్రవక్తతో సంబంధం ఉన్నట్లు చెప్పబడే మతాలు కొన్ని ఈ కాలంలో కూడా మనం చూస్తున్నాం. హజ్రత్ మూసా (అస్సలాం)ను విశ్వసించే యూదులు, హజ్రత్ ఈసా (అస్సలాం)ను నమ్మే క్రైస్తవులు ఈనాటికీ ఉన్నారు. కానీ వీరు ఇంకా తమ పురాతన మతాన్నే

అంటిపెట్టుకుని ఉండటం సరైనపద్ధతి కాదు. ఇందుకు అనేక కారణా లున్నాయి.

మొదటిది, ప్రస్తుతం వీరి దగ్గర ఉన్న దైవం అందజేసిన గ్రంథాలు వాటి నిజస్వరూపంలో లేవు. వాటిలో అనేక విషయాలు కొత్తగా చేర్చబడ్డాయి. అనేక విషయాలు తొలగించబడ్డాయి. అందువల్ల ఇప్పుడీ గ్రంథాలలో రాయబడిన విషయాలన్ని నూటికి నూరు పాళ్ళు దైవం ప్రసాదించినవని చెప్పలేం.

రెండవది, అల్లాహ్ తన దీన్(ధర్మ, జీవన విధానం)ను సంపూర్ణంగా, దాని అంతిమ స్వరూపంలో పంపిన తర్వాత కూడా పురాతన మార్గం మీదే తిష్టవేసుకొని కూర్చుంటామని, ఇప్పుడు ఆ ప్రభువే పంపిన ఆదేశాలను శిరసావహించమని పలకటం ఎవరికీ తగదు.

దైవ సమ్మతమయిన మార్గం ఒక్కటే కాగలదు. అది ఉన్నది కూడా ఒక్కటే. అదే హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ప్రపంచ మానవాళి కోసం బోధించిన మార్గం.

## దైవ ధర్మం ఒక్కటే

దేవుడు పంపిన దీన్ (ధర్మం,జీవన మార్గం) అన్ని కాలాల్లోనూ ఒక్కటిగానే ఉండేది. అదే "ఇస్లాం". ఆ ధర్మాన్నే దైవ ప్రవక్తలందరూ బోధించారు. దీన్నే చివరలో హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ప్రజలకు బోధించారు. ఏ ప్రవక్తను విశ్వసించినవారయినా ఆయా కాలాల్లో వారు ముస్లింలే. అలాగే ఇప్పుడు కూడా అంతిమ దైవ ప్రవక్తను, ఆయన చూపిన ధర్మాన్ని స్వీకరించిన వారే ముస్లింలు, ఇది చాలా సాధారణమయిన విషయం, కాని అనేక మంది ఈ విషయాన్ని మెలికలు త్రిప్పి తమ వివేకాన్ని ప్రదర్శిస్తుంటారు. సకల మతాలు సత్యమైనవేనని, మనిషి ఏ

ధర్మం అవలంబించినా దైవ సాన్నిధ్యాన్ని పొందగలడని, దైవాన్ని చేరడానికి ఇవన్నీ వేర్వేరు మార్గాలని, ఎవరేమార్గం అనుసరించినా అది సరయినదే అని అంటారు. ఇది ఘోరమయిన పొరపాటు. కొంచెం జాగ్రత్తగా యోచిస్తే ఇందులో తప్పు ఏమిటో తేలిగ్గా అర్థమవుతుంది.

ప్రస్తుతం ప్రపంచంలో వందలకొద్ది మతాలున్నాయి. ఈ మతాలన్నిటిలోనూ మామూలుగా ప్రతి మతంలో ఉన్నటువంటి ఏవో కొన్ని విషయాలు కనబడటం సర్వసాధారణం. అబద్ధమాడటం, దొంగతనం చెయ్యటం, చెడుపనులు చేయటం ప్రతి మతంలోనూ పాపం అనే పేర్కొనబడింది. అలాగే ప్రతి మతంలోనూ నిజం పలకడాన్ని, పరులకు సహాయపడటాన్ని, మంచిపనులు చెయ్యడాన్ని బోధించడం జరిగింది. అయితే అంతమాత్రాన అన్ని మతాలూ సత్యమయినవే అని నిర్ణయించటం సరికాదు. ఈ కాలంలో ఉన్న మతాల్లో కొన్ని, ఏదో ఓ యుగంలో ఎవరో ఓ దైవ ప్రవక్త బోధించినవి కూడా ఉన్నాయి, నిజమే. అయితే ఇప్పుడీ మతాలన్నీ ఏ స్వరూపంలో ఉన్నాయో ఆ స్వరూపంలో వీటన్నింటినీ సత్యమయినవని అనటం మాత్రం పరమ మూర్ఖత్వం. ఒకమతాన్ని అవలంబించే దేవుడు తన కుమారుణ్ణి భూమిపై అవతరింపజేశాడనీ నమ్ముతున్నారు. కాని 'దేవునికి కుమారులుండటం లేదా ఆయన మరొకరికి సంతానమవటం అనే విషయాలకు దేవుడు అతీతుడు, పరమపవిత్రుడు, అని ఇస్లాం ఉద్ఘాటిస్తోంది. మరి కొందరు వేరే మతస్థులు దేవుడు మానవ అవతారమెత్తి ప్రపంచంలో ఆవిర్భవిస్తూ ఉంటాడని అంటారు. కానీ దేవుడు మానవ అవతారమెత్తిపుట్టడం అనేమాట ఆయన ఔన్నత్యానికి, గొప్పతనానికి వ్యతిరేకం. దేవుడు ఏ అవతారమో ఎత్తి ఎన్నడూ భూమ్మీదకు రాలేదు. ఇలా చేయటం ఆయనకు సముచితమూ కాదు.

మానవులకు ఋజుమార్గం చూపించటానికి దేవుడు ఎల్లప్పుడూ తన ప్రవక్తలను పంపుతుండేవాడు. ఈ ప్రవక్తలంతా మానవమాత్రులే. వీరిలో ఏ ఒక్కరు కూడా దేవుని అవతారమూర్తులు కాదు. దేవుడు ఎన్నడూ మానవ రూపంగాని మరే ఇతర రూపంలో గాని భూమ్మీద అవతరించలేదు. దేవుని అవతారమని చెప్పబడేవారంతా వాస్తవానికి మానవులే. వారిని దేవుళ్ళని నమ్మటం పొరపాటు. నిజానికి దేవుడు ఒక్కడే, ఆయనకు ఒక ఆకారమంటూ ఏదీ లేదు. ఏ ఆకారాన్నీ ఆయన ధరించడు.

మానవుడు మరణానంతరం అనేక జన్మలు ఎత్తుతాడని అతని కర్మలను బట్టి ఒకప్పుడు ఉన్నతదశ పొందడం, మరొకప్పుడు కుక్క, పిల్లి లాంటి నీచ జన్మలెత్తటం జరుగుతుందని కొందరు ఇతర మతస్థులు భావిస్తారు. కాని మానవుడు మరణానంతరం కేవలం ప్రళయదినాన మాత్రమే మరో జీవితం పొందుతాడని, దానికి ముందు అనేక పర్యాయాలు జన్మలెత్తడం అనేది జరగదని ఇస్లాం అంటోంది. ఈ ప్రపంచ వ్యవహారాలను వేలాది దేవదూతలు నడుపుతున్నారని కొన్ని మతాలవారి నమ్మిక. దాని ప్రకారం శక్తిగల ప్రతిదాన్నీ వారు ఒక దేవతగా పరిగణిస్తారు, కాని దానికి భిన్నంగా ఇస్లాం సూచించేదేమంటే దేవుడు ఒక్కడే, ఆయనకెవరూ సాటి లేరు. ఈ లోకంలో జరుగుతున్నదంతా ఆయన ఆజ్ఞప్రకారమే జరుగు తోంది. ఆయన వ్యవహారాల్లో జోక్యం చేసుకునే సాహసం ఎవరికీ లేదు. ఇదే విధంగా అనేక విషయాల్లో ఇస్లాం ఇతర మతాలకు భిన్నంగా ఉంది. అందువల్ల సర్వమతాలు సత్యమైనవని, ఏ మతాన్ని అనుసరించినా దైవప్రీతి పొందవచ్చని అనటం ఎట్టిపరిస్థితుల్లోనూ సరికాదు. వాటిలో ఏదో ఒకటి మాత్రమే సత్యధర్మం అయి ఉంటుంది. ఒకే వస్తువు ఒకే సమయంలో నలుపుగాను, తెలుపుగాను; వెలుగుగాను, చీకటిగాను ఉంటుందని అంటే

మీరు ఎన్నటికీ నమ్మలేరు. ఏకకాలంలో ఆ రెండు విషయాలు నిజం కాజాలవని మీరే అంటారు. ఆ వస్తువు తెల్లగా అయినా ఉంటుంది లేక నల్లగా అయినా ఉంటుంది. వెలుగయినా అయి ఉంటుంది లేక చీకటయినా అయి ఉంటుంది. అదే విధంగా అన్ని మతాలూ సత్యమయినవే అనేమాట కూడా శుద్ధతప్పు. వాటిలో ఏదో ఒకటి మాత్రమే సత్యమయినది కాగలదు. ఎవరయినా తన మనసుకయినా నచ్చక, ఇస్లాం సత్యధర్మం అని నమ్మక పోవడం, తన బుద్ధి ఏ ధర్మాన్నయితే సత్యమయినదని చెబుతుందో దాన్ని సత్యమయినదని నమ్మడం అన్నది వేరే విషయం, కాని ఒకేసారి అన్ని మతాలూ సత్యమయినవి అనటం మాత్రం కేవలం మూఢత్వం. మేము ఆలోచించినంత వరకు దైవప్రసన్నత బడయటానికి, ఆయన్ని మెప్పించటానికి ఇస్లాం చూపిన మార్గమే సత్యమయిందని భావిస్తున్నాము. ఇస్లాం తప్ప ఇతర మార్గాలన్నీ లోపభూయిష్టమయిన మార్గాలే. ఎవరయినా విశాల హృదయంతో తన బుద్ధిని ఉపయోగించి అర్థం చేసుకోదలచి నట్లయితే మేము ఏ విషయాన్నైతే నమ్ముతున్నామో దాన్ని నమ్మడం తప్ప గత్యంతరం ఉండదనీ మా దృఢ విశ్వాసం.

ఇక్కడ ఒక విషయం గ్రహించాలి. అన్ని మతాల్లోనూ ఇస్లామే సత్య ధర్మం అని విశ్వసించటం అంటే ఇక ఇస్లాం ధర్మాన్ని విశ్వసించేవారు ఇతరులతో విరోధం పెట్టుకుని కయ్యానికి దిగాలని అర్థం ఏ మాత్రం కాదు. "ధర్మం విషయంలో ఎన్నటికీ బలాత్కారం చేయబడదు" అని దేవుడు స్పష్టంగా ఆదేశించాడు. ప్రతి మనిషి తన బుద్ధి బలాన్ని ఉపయో గించి తనకు సముచితమని తోచిన ఏ మార్గాన్నైనా అనుసరించేందుకు స్వేచ్ఛ ప్రసాదించాడు దైవం మనిషికి. బలవంతంగా ఎవరినయినా ఒక మార్గాన్నుండి తొలగించి మరో మార్గం మీదికి తీసుకురావటంగాని, ఇతర మతస్థుల మతాన్ని నిందించి వారి మనస్సును నొప్పించటం గాని ముస్లింలకు తగదు. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఉపదేశించాడు.

"ఎవరయితే అల్లాహ్‌ను వదలి ఇతరులను దేవతలుగా చేసుకొని వాటిని అర్థిస్తారో, వారి దేవతలను మీరు దూషించరాదు. ఎందుకంటే, దానికి జవాబుగా వారు విరోధంలో అనాలోచితంగా అల్లాహ్ పట్ల దుర్భాషలాడతారు. (6:108)

ఇతరులతో వాదించటం, తగవులు కొనితెచ్చుకోవటం ముస్లింల వైఖరికాదు. అన్నిటికంటే ముందు వారు తమ జీవితాన్ని ఇస్లాంకు ప్రతిరూపంగా మలచుకొని, దాంతోపాటు ఇతర సోదరులకు ప్రేమాభిమానాలతో దైవ ధర్మాన్ని పరిచయం చెయ్యాలి. దైవ ధర్మం సర్వమానవ కోటికి సంబంధించింది. ఇది కేవలం ముస్లింల కోసమే రాలేదు. అంచేత ముస్లింలు ఈ ధర్మాన్ని ఇతరులకు పరిచయం చేస్తూ వారికి దైవ సమ్మతమయిన మార్గం చూపించి, భ్రష్టమార్గాల నుంచి కాపాడాలని ముస్లింలను ఆదేశించటం జరిగింది. అయితే ఈ సందేశం అందజేయడంలో ఎవరిచేతనయినా బలవంతాన ఏదైనా మాట ఒప్పించటం లేక మతాన్ని విడనాడేలా అతనిపై వత్తిడి తేవటం చాలా తప్పు. ఇస్లాం ఇలాంటి చర్యల్ని నిషేధించింది. ఒకరోజు మానవులనందరినీ తన ఎదుట నిలబెట్టి ఎవరయితే మూఢత్వం, మొండితనం మూలాన అల్లాహ్ పంపిన సత్యధర్మాన్ని విశ్వసించలేదో వారిని శిక్షించటం అల్లాహ్ బాధ్యత. అందరూ ఆయన ఎదుట హాజరు కావలసి ఉంది. ఆయనే అందరి ఆంతర్యం తెలిసినవాడు.



# పరలోకం

మానవులకు సన్మార్గం చూపించటానికి అల్లాహ్ తన ప్రవక్తలన ప్రభవింపజేశాడు, ఆయన మానవునికి బుద్ధినిచ్చాడు. బుద్ధిని ఉపయోగించ కునే స్వేచ్ఛను ఇచ్చాడు. అతను కోరితే తన బుద్ధిని ఉపయోగించుకొని సన్మార్గం అవలంబించి మంచి పనులు చేసి, తన నిజప్రభువును మెప్పించ గలడు. లేదా దుర్మార్గం అనుసరించి చెడు పనులు చేసి తన ప్రభువుకు ఆగ్రహం కలిగించగలడు. ప్రపంచంలో పై రెండుకోవలకు చెందిన వారూ ఉన్నట్లు మనం చూస్తున్నాం. తమ యజమానినిగుర్తించి ఆయన చూపిన మార్గాన్ని అనుసరించి సత్కార్యాలు చేసేవారు కొందరుంటే, దేవుణ్ణి విశ్వసించకుండ, ఆయన ఆదేశాలను ఖాతరుచేయకుండా జీవితాంతం దుష్కార్యాలు చేస్తూ గడిపే వారు మరికొందరున్నారు. అయితే ఈ ఇరువర్గాల వారూ ఒక్కటేనా? కాదు. అలా కానేరదు. గుడ్డివాడూ కళ్ళున్నవాడు, చెవిటివాడూ వినగలిగేవాడు ఎలా సమానం కాలేరో, మంచి వాడూ–చెడ్డవాడు కూడా సమానం కాలేరు. మంచివారికి వారి మంచిపనుల సత్ఫలితం లభించాలి. చెడ్డవారు తమ చెడు పనుల పర్యవసానంగా శిక్ష అనుభవించాలి. కాని ఈ ప్రపంచంలో అనేకమంది దుర్మార్గులు, గజ దొంగలు భోగభాగ్యాలు అనుభవిస్తున్నారు. ఇతరులపై దౌర్జన్యం చేసేవారు, దైవాన్ని విశ్వసించని వారు, ఆయన ఆదేశాలను త్రోసిరాజన్న వారు అధికారం చెలాయిస్తున్నారు. లక్షలాది మనుషులను తమ బానిసలుగా చేసుకుంటున్నారు, మానవులయి ఉండి కూడా వీరు లక్షలాది మానవులకు

దేవుళ్ళయి కుర్చున్నారు. ఎంతో మంది మంచివాళ్ళు దైవభక్తులు ఘోర మయిన కష్టాలకు గురిఅవుతున్నారు. వీరు దైవారాధనలు చేస్తారు, ఆయన ఆజ్ఞల్ని పాటిస్తారు, తోటి మానవులందరి మంచికోసం పాటుపడ్తారు, వారిని ఆదుకుంటారు. కాని ఎవరి మంచికోసమైతే వారు పాటుపడు తున్నారో, ఆ ప్రజలే వీరిని నానా బాధలకు గురిచేసి హింసిస్తు న్నారు. ఒక్కొక్కసారి వారి చేతుల్లో ఈ పుణ్యమూర్తులు తమ ప్రాణాలను సైతం కోల్పోవలసి వస్తోంది. ఇదంతా మనం గమనిస్తూనే ఉంటాం.

మంచివారికి మంచిఫలితం, చెడ్డవారికి చెడుఫలితం ఎందుకు లభించటంలేదు? మంచివారు బాధించబడటం, చెడ్డవారు సకల వైభోగాలు అనుభవించటం అన్యాయం కాదా అని మీరు ప్రశ్నించవచ్చు. కాని అసలు విషయం వేరు. మనం ఇహలోక జీవితాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకుని చూస్తున్నాం, మరణానంతరం ప్రారంభమయ్యే జీవితాన్ని గురించి ఆలోచించడం లేదు.

ఈ లోకంలో మనం గడుపుతున్న ఈ జీవితం వాస్తవానికి ఓ పరీక్షా సమయం. మన ప్రభువు మనకు కొంత స్వేచ్ఛ ఇచ్చి ఎవరు ఆ స్వేచ్ఛను సద్వినియోగపరచుకుని మంచివారవుతారో ఎవరు దుర్మార్గం అనుసరించి తమకాళ్ళను తామే నరుక్కుంటారో పరీక్షించగోరి మనల్ని భూమిపై పంపాడు.

## ప్రళయం–పునర్జీవనం

ఈ విశ్వకర్మాగారమంతా సర్వనాశనమయ్యే ఓ రోజు రానున్నది. దైవాజ్ఞతో ఈ భూమి, దానికి సంబంధించిన సమస్తమూ విచ్ఛిన్నమయి పోతుంది, భూమ్మీద నివసిస్తున్న సర్వమానవులు, జంతుజాలం మరణి స్తుంది. సూర్యచంద్రులు ఢీ కొంటాయి, పర్వతాలు దూదిపింజాలయి ఎగిరిపోతాయి. మనం చూస్తున్న ఈ భూమ్యాకాశాలు క్రిందా మీదా అవుతాయి. ఆ దినమే ప్రళయదినం (ఖియామత్).

తర్వాత కొంతకాలానికి దేవుడు ఈ భూవ్యవస్థకు బదులు మరో వ్యవస్థను సృష్టిస్తాడు. అంతిమదినం వరకు పుట్టి అంతమయిపోయిన వారంతా మళ్ళీ బ్రతికింపబడతారు. మొదటిసారి పుట్టించిన దేవుడే వీరికి రెండవసారి కూడా జీవం ప్రసాదిస్తాడు. ఆ పిదప వీరందరిని తన ఎదుట సమావేశపరుస్తాడు. అదే పునర్జీవన దినం (హష్ర్). ఆ రోజు స్వామి తన దాసుల కర్మల లెక్క చూస్తాడు. తాను ప్రసాదించిన బుద్ధిని, స్వేచ్ఛను వారెలా వినియోగించారని ప్రశ్నిస్తాడు. మానవుల జీవిత రికార్డు అంతా ఆయన ముందుంటుంది. ఎవరే విధమయిన కర్మలుచేసి ఉంటారో వారికి ఆ విధమయిన ప్రతిఫలం ఇవ్వబడుతుంది. మంచివారికి వారి మంచిపనులకు గాను సంపూర్ణ బహుమానం, చెడ్డవారికి వారి దుష్కృత్యాలకు తగిన శిక్ష లభించేరోజు అదే. ఆ రోజు ప్రతి ఒక్కరికీ పరిపూర్ణమయిన న్యాయం జరుగుతుంది. ఏ ఒక్కరికి ఏ మాత్రం అన్యాయం జరగదు.

ఈ ప్రపంచంలో సుఖసంతోషాలతో భోగభాగ్యాలు అనుభవించే వారి భోగభాగ్యాలు, వారి సత్కర్మల ఫలితం కావని, కష్టాలతో సతమత మైపోయే వారి కష్టాలు వారి దుష్కర్మల పర్యవసానం కూడా కావని మీకిప్పుడు అర్థమయి ఉంటుంది. ఇక్కడ మానవుడు ఏ స్థితిలో ఉన్నా ఆ స్థితిలో అతను పరీక్షింపబడుతున్నాడు. దేవుడు కొందరికి ధనసంపదలిచ్చి వాటిని వారు తన ఆజ్ఞానుసారమే వెచ్చిస్తున్నారా లేక వాటిని పొంది విచ్చలవిడిగా వ్యవహరిస్తున్నారా అని పరీక్షిస్తున్నాడు. అలాగే కొందరిని కష్టాలలో వుంచి, ఆపదసమయంలో వారు తమ ప్రభువును ఆరాధిస్తూ ఆయన ఆదేశాలనుసారం నడుస్తున్నారా లేదా అని గమనిస్తున్నాడు. అల్లాహ్ తలచినప్పుడు తన పుణ్యసేవకులకు ఈ ప్రపంచంలో కూడా సుఖసంతోషాలు ప్రసాదిస్తాడు. అయితే ఈ సుఖసంతోషాల ద్వారా కూడా వారిని పరీక్షిస్తాడు. అలాగే ఆయన కోరినప్పుడు దుర్జనులకు కొన్ని కష్టాలు

కలిగించి అప్పుడయినా వారికి కనువిప్పు కలుగుతుందో లేదో పరీక్షిస్తాడు. అల్లాహ్‌ను తిరస్కరించి విముఖులయ్యే వారిని నాశనం చేయటం కూడా అప్పుడప్పుడు జరుగుతూ ఉంటుంది. ఈ విధంగా భూమిని దుర్జనులు లేకుండా పరిశుద్ధపరచటం కూడా జరుగుతుంది.

## పునర్జన్మ

మానవుడు తన దుష్కర్మల ఫలితం అనుభవించటానికి ఈ లోకంలోనే అనేక జన్మలు ఎత్తుతున్నాడని, ఒక జన్మలో చేసిన కర్మల ప్రతిఫలం మరో జన్మలో అనుభవిస్తూ ఒకప్పుడు నీచస్థితిలో, మరొకప్పుడు ఉచ్ఛస్థితిలో జన్మిస్తాడని కొందరు అంటున్నారు. ఇది సరికాదు. దైవ ప్రవక్త ఇలా ఎప్పుడూ తెలుపలేదు. ఇలా విశ్వసించే వారి దగ్గరకూడా ఈ విషయాన్ని దేవుడు తెలిపినట్లు ఏ ఆధారమూలేదు.★

★★★

---

★ *దీని వాస్తవికత మరింత విపులంగా తెలుసుకో దలచినవారు*
*1. మరణానంతర జీవితం, 2. ఇదియే ఇస్లాం అనే పుస్తకాలు చదవండి.*

# ఈమాన్ (విశ్వాసం)

దేవునికి పూర్తిగా విధేయులయి ఉండటమే "ఇస్లాం" అని, ఇస్లామే ఇహలోక జీవితంలోనూ, మరణానంతరం శాశ్వతమైన పరలోక జీవితంలోను కృతార్థుడు కావటానికి మానవునికి సరైన మార్గం అని మీరు తెలుసు -కున్నారు. కాని మానవుడు ఓ కన్పించని దేవుని ఆజ్ఞలను శిరసావహించి, తన మనోవాంఛలను అణచిపెట్టి అప్పటికప్పుడు లభించే ప్రాపంచిక సౌఖ్యాలను ప్రయోజనాలను వదలుకుని ఆ దైవానికి ఇష్టమైన కార్యాలనే జీవితాంతం చేస్తూ ఉండటం అంటే సామాన్య విషయంకాదు. అదీకాక మనచేత తమకు ఇష్టమైన పనులు చేయించుకోగోరే వ్యక్తులు కూడా ఇక్కడ అనేకమంది ఉన్నారు. వారి కోరికలను నిరాకరించి దైవాజ్ఞలనే పాటించటానికి నిర్ణయించుకోవటం అలాంటి వారికి, చాలామందికి కోప కారణమవుతుంది. అందుచేత వీరు అనేక విధాలుగా వత్తిడితెస్తారు. నేను నీ సోదరుణ్ణి, నేను కోరినట్లు చెయ్యి లేకపోతే నిన్ను విడిచి పెడ్తాను అని ఒకడంటే, నేను నీ తండ్రిని, నేను చెప్పినట్లు చేసితీరాలి అని మరొక డంటాడు. నేను ఊరి పెద్దను, చౌదరీని అని ఒకడు; నేను నాయకుణ్ణి, లీడర్ని అని ఇంకొకడు; నేనుపెద్దవాణ్ణి, గురువును అని వేరొకడు; అధికారం నాచేతిలో ఉంది అని మరొకడు అంటారు. ఇలా ఇతరుల్ని సంతోష పెట్టడానికి వారికి ఇష్టమైన పనులు చెయ్యాలని మనిషిపై నాలుగువైపుల నుంచి వత్తిడి తెస్తారు.

వీరంతా ఏ విషయంలో నైనా దైవాజ్ఞను తెలుసుకోవడానికి

యత్నించడం వీరికి నచ్చదు. గృహసంబంధమైన విషయాల్లో మీరు మాతో సహకరించాలి, అంతేకాని మతాన్ని ఈ విషయాలకు దూరంగా పెట్టండి అని ఇంట్లో వాళ్ళు అంటారు. మత వ్యవహారం నీ వ్యక్తిగత విషయం, నీ ఇష్టానుసారం నడుచుకోవచ్చు కాని దేశం కోసం, జాతి కోసం మేము చెప్పినట్లు చేయవలసి ఉంటుంది అని నాయకులు అంటారు. అట్లాగే మతాన్ని రాజకీయాలతో ముడిపెట్టకు, ఇక్కడయితే మా ఆజ్ఞలనే పాటించాలి, మేము నిర్ణయించిన పనులన్నీ చేయవలసి ఉంటుంది అని పాలనాధికారం గల వారంటారు.

దీన్నిబట్టి ఒక ముస్లింకు ఈ విషయాలన్నీ ఎంత కష్టదాయకంగా పరిగణమిస్తాయో ఊహించండి. తన జీవితంలోని వ్యవహారాలన్నిటిలో స్వేచ్ఛప్రకారం పనిచేయటానికి తీర్మానించుకున్న వాడే ముస్లిం. దైవం తప్ప ఇతరుల విధేయత పాటించగల అంశం ఒక ముస్లిం జీవితంలో ఎక్కడా లేదు. ఇతర మతాలను అవలంబించేవారు చాలామంది ఉన్నారు. వారు ఏవో కొన్ని పూజాపురస్కారాలు జరిపి, దైవం హక్కు నెరవేర్చామని, తాము ఇక స్వేచ్ఛాజీవులమని, తమ జీవితాన్ని తమకు ఇష్టమయిన మార్గంలో మలచుకోవచ్చు అని, తమకు ఇష్టమైన వారి ఆజ్ఞల ప్రకారం నడచుకోవచ్చు అని భావిస్తారు, కాని ముస్లిం అలా ఎన్నటికీ చేయలేడు. ముస్లిం అయితే ఏ విధంగా నమాజ్, రోజాలలో దైవం చూపిన ఆదేశాలను పాటిస్తున్నాడో, అదేవిధంగా అతను తన ఇచ్చి పుచ్చుకోవడాల్లో, వ్యాపారంలో కుటుంబ వ్యవహారాల్లో, దేశం జాతి వ్యవహారాల్లో, దేశ పరిపాలనలో, యుద్ధం, సంధి మొదలయిన విషయాల్లో - అంటే జీవితానికి సంబంధించిన సకల విషయాల్లో సయితం దైవాజ్ఞానుసారం నడచుకోవడం తప్ప అతనికి వేరే మార్గం లేదు.

ఇది చాలా కఠినమయిన పని. అన్ని వైపులనుండి దృష్టి మరల్చుకొని ఒకేమార్గం మీద సుస్థిరంగా నిలబడటం కష్టమే. కాని మనిషికి కొన్ని ముఖ్యవిషయాలలో పూర్తి విశ్వాసం లేనంతవరకు ఈ కష్ట

సాధ్యమయిన పని నెరవేరజాలదు. మీరు పరీక్షల కోసం ఎంతో కష్టపడతారు. రాత్రిళ్ళు మేల్కొంటారు. పగటి ఆటలు, వినోదాలు వదులుకుంటారు. ఎందుచేత? కష్టపడి పరీక్షలో నెగ్గితే మీకు భావిజీవితంలో సుఖం లభిస్తుందనే గట్టినమ్మకం ఉండబట్టి. ఒకవేళ మీ యీ నమ్మకం బలహీనంగా ఉంటే లేక మీరు చదవటం రాయటంవల్ల కలిగే ప్రయోజనమేమీ లేదని భావిస్తే మీ రెన్నటికీ కష్టపడరుకదా? దీన్ని ఇస్లాం విషయంలో కూడా తెలుసు కోండి. ఇస్లాం మార్గాన నిలకడగా నడవటం కష్టమైన పనే. ఈ కష్టతరమైన పనిని కొన్ని ముఖ్య విషయాలలో విశ్వాసంగలవాళ్ళే చేయగలరు. ఈ విశ్వాసం ఎంతో దృఢమయినదయి ఉండాలి. ఈ విశ్వాసాన్నే అరబీ భాషలో "ఈమాన్" అంటారు. ఇప్పుడు దీనికి సంబంధించిన విశ్వాసాలేమిటో తెలుసుకుందాం. వాటిని విశ్వసించనిదే ఎవరూ ముస్లింకాలేరు, ముస్లింగా ఉండలేరు కూడా. తప్పనిసరిగా విశ్వ సించవలసిన విషయాలు ఈ క్రింద పేర్కొనబడుతున్నాయి.

1. అల్లాహ పట్ల విశ్వాసం. అంటే "లా ఇలాహ ఇల్లల్లాహ" పట్ల విశ్వాసమన్న మాట.
2. దైవ ప్రవక్త ఎడల విశ్వాసం, అంటే "ముహమ్మదుర్రసూలుల్లాహ" పట్ల విశ్వాసమన్నమాట.
3. పరలోకం (ఆఖిరత్) పట్ల విశ్వాసం.
4. ఏ విషయాలనయితే విశ్వసించవలసిందిగా దైవ ప్రవక్త ఆదేశించారో వాటన్నిటినీ విశ్వసించడం. ఉదాహరణకు సమస్త దైవ గ్రంథాలు, సకల దైవ ప్రవక్తలు, దైవ దూతలు, అదృష్టం (తక్దీర్) మొదలైనవి.

ఈ ప్రపంచానికి సృష్టికర్త లేనేలేడనే అవివేకులు చాలా అరుదుగానే ఉంటారు. చాలామంది దైవాన్ని విశ్వసిస్తున్నారు. కాని ఒక ముస్లిం దేవుడు న్నాడని విశ్వసించినంత మాత్రాన సరిపోదు. ఒక ముస్లిం అల్లాహ పట్ల విశ్వాసం కలిగి ఉండాలంటే ఈ క్రింది విషయాలను నమ్మడం అవసరం.

1. అల్లాహ్ ఒక్కడే, ఆయనకు సాటి మరెవరూలేరు. గతంలోనూ ఉండలేదు, ఇకపైనా ఉండబోరు, ఆయనకు ఎలాంటి ఆకారంలేదు. ఆయన ఏరూపాన్ని ధరించడు, ఆయన ఎన్నడూ మానవ రూపంలో గాని, మరే ఇతరరూపంలోగాని భూమిపై అవతరించలేదు. దైవాంశ సంభూతుడైన ఏ మానవుడుగాని, మరెవరైనాగాని ఇంత వరకు పుట్టలేదు. అల్లాహ్ తప్ప ఉనికిగల సమస్తమూ అల్లాహ్‌చే సృజించబడినదే. తాను సృష్టించిన ఏ వస్తువులోనూ ఆయన లీనంకాడు.
2. అల్లాహ్‌కు సంతానమంటూ లేదు. మరియు ఆయన కూడా ఏ ఒక్కరికీ సంతానంకాడు. ఆయనకు భార్యా తోబుట్టువులు లేరు, ఆయనకు కులం లేదు వంశమూ లేదు. ఆయనవంటి వస్తువు ఏదీలేదు, ఉండజాలదు కూడా.
3. అల్లాహ్ యందు గల గుణగణాలు ఇతరుల్లో లేవు. ఆయన అందరినీ సృష్టించినవాడు. ఆయన తప్ప ఇతరులు ఏ వస్తువునైనా సృష్టించే వారు, సృష్టించగల వారెవరూ లేరు. ఆయన అందరినీ పోషించేవాడు. ఎవరినైనా పోషించగల వారు ఆయన తప్ప మరెవరూ లేరు. ★
4. అజ్ఞాత విషయాల జ్ఞానంకలవాడు అల్లాహ్ ఒక్కడే. ఆయన గుప్తమయిన ప్రతి విషయమూ తెలిసినవాడు. ఆయనకు తప్ప ఇతరులెవ్వరికీ అజ్ఞాత విషయాల జ్ఞానం లేదు. ఆయన సమక్షంలో ఏ విషయమూ దాగజాలదు. ఆయనకు మన మనసులోని మర్మం కూడా తెలుసు. ఇంతకు పూర్వం జరిగిన విషయాలన్నీ తెలుసు.

---

★ *తల్లిదండ్రులు పిల్లల్ని పోషిస్తారని సాధారణంగా అంటుంటాము. కాని వాస్తవానికి వారు చేసేదేమిటి? పిల్లల పోషణార్థం దైవం ఏర్పరచిన సాధన సామగ్రిని అతనికి అందజేస్తారు. వారు తమ ప్రయత్నంతో పాలిండ్లలో ఓ చుక్క పాలు చెయ్యలేరు, ఒక్క ధాన్యపు గింజనూపుట్టించలేరు. నిజమయిన పోషణకర్త అసలు దైవమే.*

ఇకముందు ఏం జరుగుతుందో కూడా ఆయనకు తెలుసు. ఆయన సర్వం చూస్తున్నాడు, వింటున్నాడు.

5. ఆయన ఎలాంటి లోపం లేని పవిత్రుడు, ప్రపంచం మొత్తాన్ని నడిపే ఏర్పాట్లు ఆయన ఒక్కడే చేస్తున్నాడు. ఆయనకు సహవర్తులెవరూ లేరు. ఆయనే అందరి వ్యవహారాలు చూసేవాడు. ప్రతీదీ ఆయన అధీనంలోనే ఉంది. ఆయన ఒక్కడే ఈ విశ్వానికంతటికి యజమాని, ప్రభువు. ఆయన ప్రభుత్వంలో ఎవరికీ భాగస్వామ్యం లేదు.

6. లాభనష్టాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఆయన తప్ప ఇతరులెవ్వరూ లాభమూ సమకూర్చలేరు, నష్టమూ కలిగించలేరు. ఒకడికి లాభం చేకూర్చాలనుకుంటే ఆయన్ని ఎవరూ వారించలేరు, ఆయన ఎవరికైనా నష్టం కలిగించాలని తలిస్తే ఇతరులెవరూ అడ్డుపడలేరు. లాభం చేకూర్చగలరనీ, ఆయన్ని తప్ప ఇతరులెవరినయితే ప్రజలు ఆశిస్తారో, ఇంకా ఎవరివలనయితే నష్టం కలుగుతుందని భయపడతారో వారు తాము స్వయంగానూ ఎలాంటి ప్రయోజనం కలిగించుకోలేరు. ఎలాంటి నష్టాన్నుంచీ తమను కాపాడుకోలేరు. దైవ సమక్షంలో వారు అశక్తులు, నిస్సహాయులు.

7. మన అవసరాలన్నీ అల్లాహ్ మాత్రమే తీర్చుతున్నాడు, ఆయన తప్ప ఇతరులెవరూ మన అవసరాలను తీర్చలేరు. ఆయనే మన మొరలను ఆలకిస్తున్నాడు, ఆయన్నే మనం వేడుకోవాలి, ఆయన తప్ప ఇతరులను వేడుకోవటం సరయిన పద్ధతి కాదు. ఆయన్నే నమ్ముకోవాలి. ఆయనపైనే ఆశలు పెట్టుకోవాలి, సహాయం కోసం ఆయన్ని తప్ప ఇతరులను అర్థించటం, ప్రార్థించటం తప్పు.

8. మనం అల్లాహ్ సమక్షంలోనే తలవంచాలి, ఆయన్నే ఆరాధించాలి. ఆయన ముందే చేతులుకట్టుకొని నిలబడాలి. ఇది ఆయన హక్కు.

ఆయన తప్ప ఇతరులెవరూ ఆరాధనకు యోగ్యులు కారు. మనం ఆయన పేరిట మొక్కుకోవాలి, ఆయనకు మొక్కుబడి చెల్లించు కోవాలి. ఇది కూడా ఆయన హక్కే. ఆయన పేరిట తప్ప ఇతరుల పేరిట మొక్కుకోవటం, ఇతరులకు మొక్కుబడి చెల్లించుకోవటం తప్పు. ఇలా ఎవరయినా చేస్తే అతను అల్లాహ్‌కు సహవర్తుల్ని కల్పించిన వాడవుతాడు.

9. అల్లాహ్ తప్ప ఇతరులెవరయినా మనల్ని ఆజ్ఞాపిస్తే మనం దాన్ని పాటించడానికి అలాంటి అధికారం వారికి లేదు. ఆజ్ఞాపించే హక్కు అల్లాహ్‌కు మాత్రమే వుంది. ఆయనే మన నిజ యజమాని. తాము స్వయంగా అల్లాహ్ ఆజ్ఞల్ని పాలిస్తూ ఆయన ఆజ్ఞలకు వ్యతిరేకం కాని ఆదేశాలు ఇచ్చే వారి మాటలనే పాటించటం సమంజసం. వారు తల్లి దండ్రులయినా, భర్త అయినా, గురువు అయినా, ఆచార్యులైనా, నాయకుడయినా, అధికారి అయినా ఎవరయినా సరే. మానవజీవితం కొరకు నియమాలు నిర్మించే అధికారం అల్లాహ్‌కు తప్ప ఇతరులెవరికీ లేదు. మానవుడు కేవలం అల్లాహ్‌కే దాసుడు. అతను తనను పుట్టించిన వాడు. తన వాస్తవ యజమాని నిర్మించిన చట్టం ప్రకారమే నడచుకోవాలి.

ఏ మనిషి హృదయంలోనయితే దేవుని గురించి ఇస్లాం తెలిపిన సమస్త విశ్వాసాలు చోటుచేసుకున్నాయో అతని నడవడిక గుణగణాల ద్వారా కొన్ని విషయాలు వాటంతటవే తెలిసివస్తాయి. వాటిలో కొన్నిఇవిః

1. ఆ వ్యక్తి తననుతాను సర్వస్వతంత్రుడుగా, ఎలాంటి హద్దుపద్దుల్లేని వానిగా భావించడు, ఇష్టమొచ్చినట్లు వ్యవహరించటానికి ప్రయత్నించడు. తన మనోవాంఛలకు దాసుడు కాలేడు. ప్రతి విషయంలోను అతను దేవుని దాసుడుగా మెలుగుతాడు. ఎన్నటికీ అల్లర్లు, ఉపద్రవాలు సృష్టించడు.

2. తాను స్వయంగా ఎవరి దాస్యం స్వీకరించాడో ప్రపంచంలోని మానవులందరూ ఆ యజమాని దాసులే అని తలుస్తాడు. ఆ కారణం చేత అతను ఎవరినీ ద్వేషించడు ఇంకా, తమ ప్రభువును మరచిపోయిన ప్రజలకు ఆయన ఆజ్ఞను పాలించడానికి అతను నిరంతరం ప్రేమతో, ఆప్యాయతతో పిలుపునిస్తూ ఉంటాడు.
3. అతను పూర్తిగా ఆలోచించి, అర్థంచేసుకొని స్వీకరించిన మార్గం నుండి తొలగిపోవటానికి ఎలాంటి భయప్రలోభాలకు లొంగిపోడు. ఎందువల్లనంటే ప్రభువుని మెప్పించటానికి ఏంచేయాలో అతనికి తెలుసు. ఆ విషయంలో అతను ఎంతో నిలకడ చూపిస్తాడు. దైవానికి ఇష్టంకాని పనేదీ చేయడు. అతని దృష్టిలో దేవుని అయిష్టతకు గురికావడం కంటే గొప్ప నష్టమేదీ ప్రపంచంలో ఉండదు. అంచేత ఆ మార్గాన్నుంచి తొలగటానికి బదులు అతనికి ప్రాణాలు అర్పించటం, ప్రాణాలు తీయటం సమస్తం సులువే.
4. ఏ వస్తువుకయినా తాను యజమాని అని అతను భావించడు. ఆఖరికి తన స్వంత చేతులు, కాళ్ళు ప్రాణం, దేహంలోని సర్వశక్తు లక్కూడా దేవుడే యజమాని అని భావిస్తాడు. ఈ వస్తువులన్నీ తన వద్ద అమానత్ (Trust) గా ఉన్నాయనే విషయాన్ని అతను ఎప్పుడూ గుర్తుంచుకుంటాడు. ఇంకా అతనికి తన ఇష్టానుసారం ఏ వస్తువునీ ఉపయోగంలోకి తెచ్చుకునే అధికారంలేదని, ఏ వస్తువునైనా దైవం ఆదేశించిన విధంగానే ఉపయోగించుకోవాలని, ఎందుకంటే ఒక రోజున ఈ వస్తువులన్నిటినీ గురించి ప్రతి చిన్న విషయానికి తన యజమానికి లెక్కచూపవలసి ఉందని నిత్యం గుర్తుంచుకుంటాడు. ఈ విధంగా దైవాన్ని విశ్వసించే వ్యక్తి ఎన్నటికీ అల్లర్లు సృష్టించలేడు. ఇతరుల హక్కుల్ని కాజేయలేడు, అతనికున్న ఏ శక్తి కూడా ఇతరుల వినాశానికి, నష్టానికి కారణం కాజాలదు.

5. అతడు దైవం ఇష్టపడని ఏవిషయాన్ని ఇష్టపడలేడు, దైవం ఇష్టపడే ఏ విషయాన్నీ వదలలేడు.
6. అతడు ఏ పనిచేసినా ప్రభువు సంతోషపడాలనే చేస్తాడు, అతను జీవించడం మరణించడం సమస్తం దేవుని కోసమే. అతను వ్యాపారం చేస్తాడు, వ్యవసాయం చేస్తాడు, కుటుంబపోషణకోసం జీవనోపాధిని సంపాయిస్తాడు, తన దేశ ప్రగతికోసం కృషిసల్పుతాడు, రాజకీయాల్లో పాల్గొంటాడు, జాతి సముద్ధరణకోసం కూడా పనిచేస్తాడు. అయితే ప్రతి విషయంలోనూ అతను దైవం చూపిన విధానాలనే అనుసరిస్తాడు, ఆయన ఆజ్ఞలను ఇసుమంతైనా జవదాటడు, ఇస్లాం మానవునికి సకల జీవిత విషయాలను గురించి బోధిస్తుంది. జీవితంలోని ఏ విభాగమూ ఇస్లాం పరిధికి వెలుపలలేదు.

"లా ఇలాహ ఇల్లల్లాహ్"ను విశ్వసించడం అంటే భావం ఇదే. పైన వివరించిన విషయాలను పూర్తిగా నమ్మితే కలిమాలోని ఒక భాగమయిన "లా ఇలాహ ఇల్లల్లాహ్" (అల్లాహ్ తప్ప వేరే దైవంలేడు)ను విశ్వసించినట్లే. ఇప్పుడు రెండవ భాగాన్ని తీసుకుందాం.

## ప్రవక్తల పట్ల విశ్వాసం

ఈనాటి వరకు ఏ మానవుడు కూడా దేవుణ్ణి చూడలేదు. ఈ ప్రపంచంలో ఆయన్ని ఎవరూ చూడలేరు కూడా. దేవుడు భూమిపైకి వచ్చి తనకు ఇష్టమయింది ఏదో, యిష్టం కానిదేదో ఎన్నడూ మానవులకు తెలియజేయలేదు. అయితే మనం ఏది చేయాలో ఏది చేయకూడదో మనకు ఎలా తెలుస్తుంది? ఇంతకు ముందు మీకు తెలిపినట్లు ఈ ఉద్దేశ్యంతోనే దేవుడు తన ప్రవక్తలను ప్రభవింపజేశాడు. ఈ ప్రవక్తలు మానవుడు తెలుసుకోవలసిన విషయాలన్నీ అతనికి తెలియజేశారు.

ఎవరి విషయంలోనైనా అతను దైవ ప్రవక్త అని, అతను తెలిపే

దంతా దేవుని తరపున తెలుపుతున్నాడని నమ్మకం ఏర్పడనంతవరకు అతను చెప్పిన విషయాలపై పరిపూర్ణ విశ్వాసంతో మీరు ఎలా నడచు కోగలరు? కనుకనే దైవధర్మాన్ని అనుసరించటానికి దైవం పంపిన ప్రవక్తలను విశ్వసించటం కూడా అవసరమే. ఫలానా వ్యక్తి దైవ ప్రవక్త అవునా కాదా అనే విషయం పట్ల మీకు మొదట పూర్తిగా తృప్తికలగాలి.

ఇస్లాం మార్గాన్ని అనుసరించటానికి ముహమ్మద్ (సఅసం)ను అంతిమ దైవ ప్రవక్త అని విశ్వసించటం అత్యవసరం. అంటే ముహమ్మద్ (సఅసం)ను దేవుడు తన ప్రవక్తగా నియమించి దైవ ధర్మాన్ని దైవదాసు లందరికీ తెలుపాలని ఆదేశించాడని, దైవప్రవక్త (సఅసం) బోధించిన విషయాలన్నీ దైవం తరపునుంచే బోధించారని, అవన్నీ సరైనవి, నిజమయినవి, వాటిలో ఏదీ అసత్యం కాదని; ఏ విషయాన్నీ సంశయిం చడానికి సందేహించడానికి ఆస్కారం లేదని మీరు పూర్తిగా విశ్వసించాలి. హజ్రత్ ముహమ్మద్ (సఅసం)ను నిజమైన దైవ ప్రవక్తగా విశ్వసించిన తర్వాత ఈ క్రింద వివరింపబడిన విషయాలు అనివార్యమవుతాయి.

1. హజ్రత్ ముహమ్మద్ (సఅసం) ఆజ్ఞాపించారని తెలిసిన ప్రతి విషయాన్ని మీరు ఏ మాత్రం సంకోచించకుండా అంగీకరించాలి.
2. ఆయన ఒక పని నిషేధించారని మీకు తెలిసినంతనే దాన్ని మానేయాలి. అలాగే ఆయన ఒక పనిని చేయమని ఆదేశించారని తెలిసినప్పుడు మీరాపని చేయడంలో ఏ మాత్రం అశ్రద్ధ చేయకూడదు.
3. దైవ ప్రవక్త ఆదేశంఉండగా దానికి వ్యతిరేకంగా మరే మానవుని ఆదేశాన్నీ పాటించకూడదు. ఇతరుల ఆదేశాన్ని అది దైవ ప్రవక్త ఆదేశానికి అనుగుణంగా ఉంటే మాత్రం పాటించవచ్చు. దానికి వ్యతిరేకంగా లేక దానికి భిన్నంగా ఉన్న ఇతరుల ఆజ్ఞల్ని పాటించడం సమంజసం కాదు-వారు పెద్దలీడరుగారైనా మహాత్ములవారయినా, మౌలానా అయినా పెద్దవారయినా, గురువు గారయినా, పురోహితులయినా,

అధికారి అయినా, మిత్రుడైనా, బంధువు అయినా మరెవరయినా సరే. దైవ ప్రవక్త ఆదేశానికి వ్యతిరేకమయిన ఆదేశాన్ని, ముస్లిం ఎన్నటికీ శిరసావహించడు- దాన్ని ఎవరిచ్చినా సరే.

4. దైవ ప్రవక్త తెలిపిన ఆచారానికి వ్యతిరేకమయిన ఏ ఆచారాన్నీ పాటించరాదు. అది మీవంశంలో ఎంత పురాతనమయిన ఆచారంగా వస్తూ ఉన్నప్పటికీ దాన్ని చేయటానికి మీ బంధువులు ఎంత వత్తిడి తెచ్చినా మీరు ఆ ఆచారాన్ని అనుసరించకూడదు. ఒక ముస్లిం అన్నింటినీ వదులుకోగలడుగాని దైవప్రవక్త చూపిన విధానాలను మాత్రం మానుకోలేడు. అతడు అలాగేచెయ్యాలికూడా.

5. మీ హృదయంలో హజ్రత్ ముహమ్మద్(సఅసం) పట్ల అపార మయిన ప్రేమ ఉండాలి. మీరు ఆయన్ని మనస్ఫూర్తిగా గౌరవిం చాలి. దైవప్రవక్త (సఅసం)పట్ల ప్రేమ గౌరవాలు లేని హృదయంలో నిజానికి విశ్వాసం కొరవడిందన్న మాట. దైవ ప్రవక్తను విశ్వసించడమంటే ఆయన పట్ల ప్రేమ ఎంతో గాఢమయిందయి ఉండాలి. ఆయన ఆజ్ఞల్ని మీరు పాటించకుండా చేసే ఏ ప్రేమకూ మీ హృదయంలో చోటుండ రాదు. మీ హృదయంలో దైవప్రవక్త ఔన్నత్యం అత్యంత బలంగా నాటుకోవాలి. ఆయనకు ప్రతికూలంగా మరెవరినీ గొప్పవాడుగా, మహాప్రవక్త ఆదేశాలకు వ్యతిరేకంగా మరెవరి ఆదేశాలూ పాటించదగినవిగా భావించరాదు.

"ముహమ్మదుర్రసూలుల్లాహ్"ను విశ్వసించడం అంటే అర్థం ఇదే, ఇది కలిమా రెండవ భాగం.

"లాఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్" (అల్లాహ్ తప్ప వేరే దేవుడు లేడు, ముహమ్మద్ (సఅసం) దేవుని సందేశహరుడు) అనే కలిమా ఈమాన్ (విశ్వాసం)కు పునాది వంటిది. దీన్ని విశ్వసించకుండా ఏ మనిషీ ముస్లిం కాజాలడు.

## పరలోకం పట్ల విశ్వాసం

ఈ ప్రపంచ కర్మాగారం యావత్తు ఒక రోజు అంతమవుతుందని, మానవులంతా మరణిస్తారని, మరికొంత కాలానికి అల్లాహ్ అందరినీ బ్రతికిస్తాడని, అందరూ తమ స్వామి ఎదుట సమావేశమవుతారని, ఆయన అందరికర్మలను గురించి విచారణ జరుపుతాడని, మీరు లోగడ తెలుసుకున్నారు. ఆ రోజున అల్లాహ్‌ను తమ స్వామిగా స్వీకరించి ఆయన చూపిన మార్గాన నడచినవారికి వారి సత్క్రియలకు తగిన సత్ఫలితం ఇవ్వటం జరుగుతుంది. ఎవరయితే ఆయన్ని తమ స్వామిగా స్వీకరించ లేదో, ఆయన ఆజ్ఞలను పెడచెవిన పెట్టారో, వారు తమ దుష్కర్మలకు తగిన దుష్ఫలితం అనుభవించవలసి ఉంటుంది. ఆ రోజున సకల సుఖ సంతోషాలు దేవుని సజ్జనులయిన దాసులకే లభిస్తాయి. ఆయన చూపిన మార్గం వదలి పెడత్రోవ పట్టిన వారు శిక్ష అనుభవించడం తప్పదు.

ఇస్లాం మార్గాన్ని అనుసరించటానికి ఈ సత్యాన్ని తెలుసుకోవడం, దాన్ని హృదయపూర్వకంగా నిజమని విశ్వసించటం అవసరం. పరలోకం పట్ల పరిపూర్ణ విశ్వాసం లేకుండా ఏ మనిషీ ముస్లిం కాలేడు. ఎవరి హృదయంలోనయితే పరలోక విశ్వాసం ఉండదో అతను సత్యం చూపే సన్మార్గాన్ని అనుసరించటంలో ఎన్నటికీ కృతార్థుడు కాలేడు. తమ అకృత్యాలకు దుష్ఫలితం చవిచూడవలసి ఉంటుందని భయంలేనివారు సదా అత్యాచారాలు చేస్తూ, కల్లోలాలు సృష్టిస్తూ ఉండటం మీరు చూస్తూనే ఉన్నారు. ఏదైనా మంచి బహుమానం లభిస్తుందని ఆశలేనంత వరకు మీరు ఏ పని చేయటానికయినా ఇష్టపడరు. ఈ లోకపు ప్రయోజనాలే దృష్టిలో ఉన్నవారు మంచి పనులు చేయటంలో ఎక్కువకాలం స్థిరంగా నిలువలేరు. ఇంకా భవిష్యత్తులో ఘోర నష్టానికి గురికావలసి వచ్చినా వారు తక్షణం లభించే ప్రయోజనాలకోసమే ప్రాకులాడుతారు. అందుచేతనే

మరణానంతరం లభించే శాశ్వత జీవితాన్ని గురించి మనం మరేవిధంగానూ తెలుసుకోలేని అనేక విషయాలు మనకు దైవప్రవక్త (సఅసం) తెలిపి ఉన్నారు. ఆ విషయాలన్నీ సత్యమని భావించడం, వాటిని విశ్వసించటం అవసరం. ఈ విషయాలన్నీ సత్యాలు, మరణించిన తర్వాత ప్రతిమనిషి తన కళ్ళతోనే ఈ విషయాలన్నిటిని ప్రత్యక్షంగా చూసుకునే రోజు తప్పకుండా వస్తుంది. కాని ఆ రోజున వాటిని తెలుసుకోవడం వల్ల ఎలాంటి ప్రయోజనమూ ఉండదు. అప్పటికి పరీక్ష గడువు ముగుస్తుంది. తర్వాత ఎవరేది సంపాయించుకున్నారో వారికి దానికనుగుణంగానే ప్రతిఫలం లభించి తీరుతుంది. ఈ విషయాలను తెలుసుకొని వాటిని సత్యమైనవిగా నమ్మి మన పనులు చక్కబరచుకోవలసిన సమయం మరణానికి ముందున్నదే.

పరలోకం గురించి ఏఏ విషయాలను విశ్వసించవలసి ఉందో అవి క్రింద పేర్కొనబడుతున్నాయి. అవి నిజమైనవని పరిపూర్ణవిశ్వాసం కలిగి ఉండాలి.

1. ఒకానొక దినం రాబోతుంది, ఆనాడు దేవుడు ఈ ప్రపంచం మొత్తాన్ని నిర్మూలిస్తాడు. మానవులంతా మరణిస్తారు. ఆ దినాన్నే ఖియామత్ (ప్రళయం) అంటారు.
2. ఆ తర్వాత దేవుడు మానవులనందరినీ తిరిగి బ్రతికిస్తాడు. అందరూ అల్లాహ్ ఎదుట హాజరవుతారు. దానిని హష్ర్ (లేపబడటం, సమీకరించబడటం) అనంటారు.
3. ప్రతి మనిషి ఈ లోకంలో చేసుకున్న దాని వివరమంతా దైవం ముందు సమర్పించబడుతుంది. ప్రతి మనిషి చేసిన సమస్తపనుల కర్మపత్రం అతని చేతికి ఇవ్వబడుతుంది. మంచివారి కర్మపత్రం వారి కుడిచేతికి, చెడ్డవారి కర్మపత్రం వారి ఎడమచేతికి ఇవ్వబడతాయి.

4. ప్రతి మనిషి చేసిన మంచి పనులు, చెడుపనులు తూచబడుతాయి, ఎవరి మంచి పనులు ఎక్కువగా ఉంటాయో వారికి బహుమానం లభిస్తుంది. వారికి స్వర్గప్రవేశం ప్రాప్తమవుతుంది. ఎవరి చెడుపనులు ఎక్కువగా ఉంటాయో వారు శిక్షించబడతారు, వారు నరకంలోకి నెట్టివేయబడతారు. ఎవరైతే ఆ రోజున నరకం నుండి తప్పించుకుని స్వర్గప్రవేశం పొందుతారో వారే సఫలీకృతులైన వారు.

పరలోకం గురించి పైన పేర్కొనబడిన విషయాలు ఎవరి హృదయాల్లో దృఢంగా నాటుకుంటాయో వారి జీవితం, వారి పనులు పూర్తిగా మారిపోతాయి. వారికి, ఇతరులకు మధ్య స్పష్టమైన వ్యత్యాసం కన్పిస్తుంది, వారి స్వభావ స్వరూపాలు అలవాట్లు పూర్తిగా మారిపోతాయి.

1. అలాంటి వ్యక్తి తెలిసి ఏ పనీ దైవాజ్ఞలకు భిన్నంగా చేయడు. ఒకవేళ మరచిపోయో, పొరపాటు వల్లనో ఏదైనా అలాంటి పని చేస్తే తెలుసుకున్న వెంటనే పశ్చాత్తాప్పడి దైవాన్ని క్షమాపణ వేడుకుంటాడు. చేసిందానికి పశ్చాత్తాపంచెంది, ఇక ఎన్నటికీ అలాంటితప్పు చేయనని వాగ్దానం చేస్తాడు. "ప్రభూ! నావల్ల పొరపాటు జరిగిపోయింది. ఇక ముందు మళ్ళీ ఇలాంటి తప్పుచేయను, నన్ను క్షమించు. నీవే క్షమించే వాడవు నీవు కనికరించకపోతే నాగతేమికాను" అని వేడుకుంటాడు. ఎవరయితే సతతం చెడు పనులు చేస్తారో మరెవరికైతే ఒక రోజు తాము తమ ప్రభువు సమక్షంలో హాజరుకావలసి ఉంటుందనే భయం ఉండదో వారసలు పరలోకాన్నే విశ్వసించరు. విశ్వసించినా వారి విశ్వాసం క్రమేణా క్షీణిస్తూ ఉంటుంది. ఆ తర్వాత ఎప్పుడో ఒకప్పుడు వారి హృదయాల్లో నుండి పరలోక విశ్వాసం పూర్తిగా నిష్క్రమిస్తుంది.

2. పరలోకం పట్ల విశ్వాసం గలవారు ఎప్పుడూ దౌర్జన్యం చేయరు. అధర్మం పలకరు. అసత్యం, మోసం, వంచనతో కూడుకున్న

పనులకు దూరంగా ఉంటారు. ఎవరి హక్కునూ కాజేయరు. ఒకవేళ అలాంటిది ఏదైనా జరిగితే వెంటనే పశ్చాత్తాపం చెంది క్షమాపణ వేడుకుంటారు. దౌర్జన్యానికి, అన్యాయానికి గురియైనవారికి వారి హక్కులు తిరిగి ఇచ్చివేస్తారు.

3. వారి సమక్షంలో ఎంత గొప్పలాభం వచ్చినా, వారు ఎంత నష్టాన్ని భరించవలసి వచ్చినా ఎన్నటికీ వారు దైవ సమ్మతమైన కార్యాలను వదలరు. ఎవరి మనసులో పరలోక విశ్వాసం ఎంత పటిష్టంగా ఉంటుందో అతడు అంతటి కష్టాన్ని సహిస్తాడు. ఇలాంటివారు చెప్పేదేమంటే "మనం దేని గురించి భయపడాలి? మహా అయితే మన ప్రాణాలు తీస్తారు, అంతకంటే ఎక్కువ నష్టం ఏంచేయగలరు? అయినా దానివల్ల ఏమవుతుంది, ఎటూ మనం దేవుని దగ్గరకే మరలిపోవలసి ఉంది, అలాంటప్పుడు ఆయన ఆగ్రహపడే పని ఎందుకు చేయాలి? ముస్లింలు పొందగలిగే గొప్ప ప్రయోజనం ఏదైనా ఉంటే అది దైవ ప్రీతిని పొందడం. దైవ సమ్మతం కాని పని చేయటమే అతనికి కలిగే ఘోరనష్టం" అని భావిస్తారు. ఇలా భావించే వ్యక్తి ఎన్నటికీ తన స్వీయకోరికలకు బానిస కాలేడు. కుటుంబసభ్యులు, ఇతర బంధు మిత్రుల ఆచారాల దాస్యాన్ని సహించడు. అతను ఏ ఒక్క నాయకుణ్ణీ గుడ్డిగా అనుసరించడు, ప్రభుత్వంతెచ్చే ఎంత గొప్ప ఒత్తిడికైనా తలవంచడు. అతను ఏ పని చేయదలచినా పరలోకంలో దాని పర్యవసానం ఏమిటి అని విచారించి గాని చేయడు. ధనాశాపరులు, అధికారవ్యామోహులు, పేరు ప్రఖ్యాతుల కోసం ప్రాకులాడేవారు దైవాజ్ఞలను ఉల్లంఘించి వారిష్టానుసారం నడుస్తూ ఉంటారు. అలాంటి వారి హృదయంలో పరలోక విశ్వాసం పూర్తిగా తుడిచిపెట్టుకొనిపోయి ఉంటుంది. ఒకవేళ ఏ కొద్దిగా ఉన్నా క్రమంగా అది కూడా సన్నగిల్లి పోతుంది.

# దైవదూతల పట్ల విశ్వాసం

ముష్రిక్★ ప్రజలు ఆరాధించే దైవేతర శక్తులు రెండు రకాలైనవి. ఒకటి, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, నీరు, సముద్రం, పర్వతం, వగైరా వంటి కనబడే శక్తులు. రెండు, జిన్నులు, భూతప్రేతాలు, దేవి, దేవతలు మొదలైన కనబడని శక్తులు. అయితే వీటిలో ఏ ఒక్కటీ దైవం చేసే పనులలో భాగస్వామ్యం కలిగిలేదని దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) తెలిపారు. ఈ విషయాన్ని మీరు "లా ఇలాహ ఇల్లల్లాహ్" వివరణలో తెలుసుకున్నారు. దైవసృష్టిలో మనకు కన్పించనివి కూడా ఎన్నో ఉన్నాయి. ఇందులో దైవదూతలు కూడా ఉన్నారు. వీరు దైవాజ్ఞలతో లోకంలోని అనేకపనుల ఏర్పాట్లు చేస్తూ ఉంటారు. కొంత మంది గాలి వీచేటట్లు చేయటంలో నిమగ్నమై ఉంటే మరి కొంతమంది వర్షం కురిపించే పనిలో ఉంటారు, ఇలా వీరు దైవాజ్ఞలతో అనేక పనులు నిర్వహిస్తూ ఉంటారు. దైవదూతలు దైవాజ్ఞలకు కట్టుబడి ఉండటం తప్ప తమంతట తాము ఏ పనీ చేయలేరు. వారు ఏ ఒక్కరికీ లాభనష్టాలు కలిగించలేరు. అందువల్ల వారిని పూజించటం, సహాయం అర్థించటం పూర్తిగా తప్పు. దైవదూతలను గురించి దేవుడు మనకు వాస్తవ విషయాలు తెలిపాడు. అదేమంటే- దైవదూతలంతా దేవునిచే సృజింపబడినవారు. దైవ సృష్టిలో గొప్పస్థానం కలవారు. పాపాలకు అతీతులు, వారు దైవాజ్ఞల్ని ఏమాత్రం ధిక్కరించలేరు. సదా దైవనామ సంకీర్తనం చేస్తూ ఉంటారు. వారిని ఆయన ఏపనికై నియమించాడో దాన్నే చేస్తారు.

ఈ దైవదూతల్లో హజ్రత్ జిబ్రీల్ (అస) ఒకరు. ఈయన దైవప్రవక్తల వద్దకు దైవసందేశం తెస్తూ ఉంటారు. ఈయనే హజ్రత్

---

★ దైవాన్ని వదలి ఇతరులను పూజించేవారు, ఆయన దైవత్వంలో సాటికల్పించేవారు ముష్రిక్ అనబడతారు.

ముహమ్మద్(సఅసం)కు దివ్యఖుర్ఆన్ని అందజేస్తూ ఉండేవారు. ఆహార సరఫరాచేసే బాధ్యత హజ్రత్ మెకాయిల్ (అస) అనే దైవదూతకు ఇవ్వబడింది. ప్రాణాలు తీసే పని హజ్రత్ ఇజ్రాయీల్ (అస) చేస్తూ ఉంటారు, ఈ దైవదూతల్లోనే సదా మనతో పాటు ఉండే దైవ దూతలు కూడా కొందరున్నారు. వారు మన కర్మలను ఎప్పటికప్పుడు రికార్డు చేస్తూ ఉంటారు. ఇలా రికార్డు చేసినదంతా తీర్పుదినాన మనముందు ప్రవేశపెడతారు.

దేవదూతలను గురించి పై వాస్తవాలు తెలిపిన తర్వాత మనిషి ఒకరిని గాలి దేవుడని, స్వతంత్ర అధికారాలు గల శక్తిమంతుడని పూజించడం గాని, ఇంకా ఇతర దైవదూతల్లో ఒకరిని పోషకునిగా మరొకరిని వినాశకరునిగా తలచి వారిని పూజించడం గాని చేయలేడు, దైవ దూతలను విశ్వసించిన తర్వాత ఇలాంటి తప్పుడు భావాలన్నీ పూర్తిగా సమసిపోతాయి. కనుక దైవ దూతల పట్ల విశ్వాసముంచడం కూడా చాలా అవసరం. కాని వారిని పూజించటం, వేడుకోవటం, అర్థించటం, వారికి భయపడటం ఏ విధం గానూ సమంజసం కాదు. వీరంతా దైవ విధేయులు, తమకు తోచినట్లు ఏదీ చేయజాలరు.

## దైవ ప్రవక్తలు, దైవ గ్రంథాలపట్ల విశ్వాసం

మానవులు ఏ పనులు చేయాలి, ఏపనులు చేయకూడదు, ఏ విషయాలంటే దేవుడు ఇష్టపడతాడు, ఏ విషయాలు ఆయనకు యిష్టంకావు మొదలగు విషయాలన్నీ తెలియజేయటానికి దేవుడు తన ప్రవక్తలను పంపాడు. ఈ ప్రవక్తలు ప్రతికాలంలో, ప్రతిదేశంలో ఆవిర్భవించి దైవ ధర్మాన్ని దైవదాసులైన మనుషులకు అందజేశారు. వీరంతా సత్యవంతులు. ముస్లిం కావటానికి దైవ ప్రవక్తలందరినీ నిజమయిన వారని భావించి వారిపట్ల విశ్వాసం కలిగి ఉండటం అవసరం. అందరికీ చివర వచ్చిన

హజ్రత్ ముహమ్మద్ (సఅసం) పట్ల విశ్వాసం కలిగి ఉండటం ప్రత్యేకంగా అవసరం. దీన్ని గురించి వివరంగా మీరింతకు ముందే తెలుసుకున్నారు.

దేవుడు అనేక ప్రవక్తల వద్దకు తన గ్రంథాలను పంపాడు. కొన్ని గ్రంథాల పేర్లు ఆయన మనకు తెలిపాడు. సుహుఫె ఇబ్రాహీంను హజ్రత్ ఇబ్రాహీం (అస) వద్దకు, జబూర్ (PSAMS)గ్రంథం హజ్రత్ దావూద్ (అస) వద్దకు పంపాడు. తౌరాత్ (TORAH)ను హజ్రత్ మూసా (అస)కు, ఇంజీల్ (కొత్తనిబంధన)ను హజ్రత్ ఈసా (అస)కు ప్రసాదించాడు. వీరికే గాక ఇతర ప్రవక్తలకూ్కడా దైవ గ్రంథాలు ఇవ్వబడి ఉండవచ్చు. అయితే వాటి పేర్లేమిటో మనకు తెలుపటం జరగలేదు. ఈ సమస్త గ్రంథాలు దైవ ప్రోక్తాలని, సత్యమైనగ్రంథాలని విశ్వసించటం అత్యంతావశ్యకం. కాని ప్రస్తుతం మనకు సన్మార్గం చూపటానికి ఆఖరిలో దేవుడు దివ్య ఖుర్‌ఆన్ పంపాడు. ఇందులో కావలసిన విషయాలన్నీ ఉన్నాయి, ఇప్పుడు కేవలం ఈ గ్రంథం చూపే మార్గాన్ని మాత్రమే అనుసరించటం సరైన విధానం.

ఎందుచేతంటే (1) ఇది అన్నిటికంటే చివరిలో అవతరించింది. ఇందులో దేవుడు మనకు అవసరమయిన సర్వ విషయాలు తెలిపి యున్నాడు. (2) ఇప్పుడు ఖుర్‌ఆన్ తప్ప మరే దైవ గ్రంథం కూడా తన నిజస్వరూపంలో లేదు. సుహుఫె ఇబ్రాహీం అయితే ఇప్పుడసలు ఎక్కడా లభించదు. పోతే మిగిలినవి జబూర్, తౌరాత్, ఇంజీల్, ఈ గ్రంథాలలో వాటిని విశ్వసించినవారు తమతరఫున ఎన్నో విషయాలు కల్పించటం, తగ్గించటం జరిగింది. అందువల్ల ఇప్పుడు వాటిలో ఎంతభాగం దైవప్రోక్తమయింది, ఎంతభాగం మానవకల్పితం అన్నది తెలుసుకోలేము.

ఇవిగాక ఇతర మత గ్రంథాలున్నాయి. అవి కూడా దివ్య గ్రంథాలని దైవప్రోక్తములని అంటారు ఆయా మతస్థులు, కాని వాటిని గురించి మనం అవి దైవప్రోక్తములని కాని, దైవప్రోక్తములు కావని కాని విశ్వస

నీయంగా చెప్పలేం. అయితే దైవం తరపున వచ్చిన ఏ గ్రంథాలయినా సరే అవన్నీ నిజమైనవని మనం విశ్వసించడం మాత్రం తప్పనిసరి.

## తక్‌దీర్ (విధి లేక అదృష్టం)

ఈ విశ్వానికి వాస్తవ యజమాని, అధికారి అల్లాహ్ మాత్రమే. ఇక్కడ సంభవించేదంతా ఆయన ఆజ్ఞానుసారమే సంభవిస్తోంది. ముస్లిం కావటానికి లోకంలో సంభవించే విషయాలన్నీ ఆయన ఇష్టం ప్రకారమే సంభవిస్తున్నాయని, ఆయన అభీష్టానికి, ఆయన నిర్ణయాలకు వ్యతిరేకంగా ఏ పనీ జరగదు, జరగజాలదు అని గట్టిగా విశ్వసించటం చాలాముఖ్యం. ఈ సత్యాన్ని విశ్వసించిన తర్వాత మనిషి ఏ ఆపద వచ్చినా అధైర్యపడడు. ఎందుకంటే ఇది కూడా దేవుని ఇష్టానుసారమే జరుగుతుందని భావిస్తాడు. అట్లాగే ఏదైనా సౌఖ్యం లభించినప్పుడు అతను తనను తాను మరచి ఇది నా కృషిఫలం అని గర్వంతో విర్రవీగడు. ఇదే తక్‌దీర్ (అదృష్టం) పట్ల విశ్వాసం అంటే. ఇలా విశ్వసించిన ముస్లిం దేవుని ఇష్టమే తన ఇష్టమని భావిస్తాడు, ఎన్నటికీ నిరాశచెందడు. అనుక్షణం దైవం చూపిన విధానాల ప్రకారమే పనిచేయటానికి ప్రయత్నిస్తాడు. అతని మార్గంలో ఎన్ని కష్టాలు వచ్చినా, బాధలు కలిగినా, ఎన్ని ఆటంకాలు ఎదురైనా అన్నిటినీ సహిస్తూ ముందుకు సాగుతాడు. ఎందువల్ల? ఏది జరిగినా అది దేవుని ఇష్టప్రకారమే జరుగుతుందని అతని నమ్మకం. అలాంటప్పుడు ఎందుకు అధైర్యపడాలి? అతని ప్రయత్నాలకు ఫలితంగా ఏదైనా అతని ముందు వచ్చినప్పుడు కూడా గర్వంతో గంతులేయడు. తన ప్రభువు ముందు వినయంగా తలవంచి "ప్రభూ! ఇదంతా నీ ద్వారానే లభించింది. ఇదంతా సాధించు కోటానికి మాలో ఆ మాత్రం శక్తి ఎక్కడ? అంతా నీ అనుగ్రహ ఫలితమే" అని విన్నవించుకుంటాడు. అటు నిరాశ నుండి, ఇటు గర్వం నుండి రక్షించుకోటానికి తక్‌దీర్ లేక అదృష్టాన్ని విశ్వసించడం అత్యంతావశ్యకం.



# ఇస్లామ్

విధేయతనే అరబీ భాషలో ఇస్లాం అంటారని మీరు తెలుసుకొని ఉన్నారు. సకల జీవన రంగాలలో దైవాజ్ఞలను అనుసరిస్తూ, ప్రతి పనిలోనూ ఆయనకు విధేయుడయి మెలగటం ముస్లిం (దైవ విధేయుని) కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చటం, పూర్తి జీవితాన్ని దైవ విధేయతకు అనుగుణంగా రూపొందించడం అంత సామాన్య విషయం కాదని కూడా మీరింతకు ముందు అధ్యాయంలో తెలుసుకున్నారు. దీనికై మనిషి హృదయంలో కొన్ని వాస్తవాలను గురించిన దృఢ విశ్వాసం పటిష్టం కావలసి ఉంది. ఆ విశ్వాసాన్నే ఈమాన్ అనంటారు. ఏ విషయాలను గురించి అయితే ఈమాన్ (విశ్వాసం) కలిగి ఉండాలో వాటిని కూడా మీరు తెలుసుకున్నారు. వాటిని విశ్వసించిన తర్వాతనే మీరు ముస్లింలవుతారు. కాని అప్పుడే మీరు పూర్తిగా ముస్లింలు కాలేదు. పూర్తిగా ముస్లింలు కావాలంటే మీరు దైవ ప్రవక్త తెలిపిన ఆజ్ఞలను అంగీకరించి ఆచరణ ద్వారా వాస్తవంగా మీరు విధేయతకు లభించే ఏ ఆజ్ఞయినా సరే నెరవేర్చడానికి సిద్ధపడినట్లు ఋజువు చేయాలి. నేను విధేయత పాటించటానికి సిద్ధంగా ఉన్నానని కేవలం నోటితోనయితే చెప్పి ఏ ఒక్క ఆజ్ఞను కూడా ఆచరించి చూపకపోతే అలాంటి మాటలు నిజమని ఎవరు నమ్ముతారు? దేవుడే సర్వాధికారి అని అంగీకరించి, ఆయన ప్రవక్త తరఫు నుండి లభించిన ప్రతి ఆదేశాన్ని శిరసావహిస్తానని ఒప్పుకోవడమే కదా ఈమాన్ అంటే. ఈ

విషయాన్ని ఒప్పుకున్న తర్వాత మీరు దైవాజ్ఞలను శిరసావహించక, దైవ ప్రవక్త చూపిన పనులను చేయకపోతే మీ మాటలు నిజంకావని, వాటిలో ఏదో లోపం ఉందని అనుకోవలసి వస్తుంది.

ఇస్లాం మీద స్థిరంగా ఉండటానికి, సకల జీవనరంగాల్లో దాన్ని పాటించటానికి తప్పనిసరిగా చేయవలసిన పనులు, మానుకోవలసిన పనులు అన్నిటినీ దైవ ప్రవక్త (సఅసం) మనకు తెలిపి ఉన్నారు. వాటిలో ప్రతి ముస్లిం విధిగా చేయవలసిన ఇబాదాత్ (ఆరాధనలు) అన్నిటికంటే ముఖ్యమయినవి. మొదట మనం 'ఇబాదాత్' అంటే ఏమిటో తెలుసుకుందాం.

## ఇబాదత్ (ఆరాధన)

ఇబాదత్ అంటే దాస్యం చేయటం అని అర్థం. మనం అల్లాహ్ దాసులం. ఆయన సేవకులం. ఆయన మనకు పూజనీయుడు. ఇక మనం ఆయన సేవకులుగా, దాసులుగా ఆయన ఆదేశానుసారం చేసే పనే దాస్యం. దాన్నే ఇబాదత్ లేక ఆరాధన అంటారు. దీన్ని మరో విధంగా చెప్పాలంటే మీరు ప్రజలతో మాట్లాడుతున్నారనుకోండి, అప్పుడు మీరు అసత్యం పలకరు. ఏ ఒక్కరితో చెడ్డగా మాట్లాడరు. ఎలాంటి చెడుమాటలు మీ నోటి నుండి వెలువడవు. ఎందుకంటే మీ ప్రభువైన అల్లాహ్ ఇలా ఎన్నటికీ చేయరాదని, సదా సత్యమే పలకాలని, మంచి మాటలే మీ నోటి ద్వారా వెలువడాలని ఆజ్ఞాపించాడు. ఈ విధంగా మీరు మాట్లాడటం 'ఇబాదత్' అనబడుతుంది. ఈ మాటలు వ్యాపార సంబంధమైనవైనా సరే లేక ప్రపంచ వ్యవహారానికి చెందినవయినా సరే. అలాగే మీ ఇచ్చిపుచ్చుకోడాలు, చదువుసంధ్యలు, ఇంట్లో అన్నదమ్ములతో అక్కా చెల్లెళ్ళతో మెలగటం, మిత్రులతో, బంధువులతో కలిసిమెలసి ఉండటం సమస్తం 'ఇబాదత్' అవుతాయి. అయితే మీరు ఏ పని చేస్తున్నా దైవం నిషేధించిన దాన్ని మాత్రం

చేయకూడదనే తలంపు మీకు ఉండాలి. నిత్యం దైవాజ్ఞలకు విరుద్ధంకాని పనులనే చెయ్యాలి. ఈ విధంగా ఈ పనులన్ని కూడా ఇబాదత్ అనబడుతాయి. ఏ పనులయినా దైవాజ్ఞలపై నడుస్తూ, దైవప్రీతి కోసం చేస్తే అవన్నీ ఇస్లాం దృష్టిలో ఇబాదత్‌గానే పరిగణించబడతాయి.

ఇబాదత్(ఆరాధన) యొక్క అసలు అర్థం ఇదే. ఇస్లాం మానవుణ్ణి తన పనులన్నిటిలో పరిపూర్ణ దైవ విధేయుడయిన దాసుడుగా తయారు చేయాలని కోరుతుంది. ఈ పని కోసం కొన్ని ప్రత్యేక ఆరాధనల్ని దేవుడు ప్రతి ముస్లింపై విధిగా నిర్ణయించాడు. వాటిని ఆచరించటం ప్రతి ముస్లిం కర్తవ్యం. ఈ ఆరాధనలను పూర్తిగా ఆచరించనంత వరకు మనిషి తన జీవితం మొత్తాన అన్ని పనుల్లోనూ దైవ దాసుడుగా జీవించలేడు. ఈ ఆరాధనలే ప్రతి విషయంలోను దైవ విధేయుడిగా ఉండటానికి, ఏ పనయినా దైవేచ్ఛకు వ్యతిరేకంగా చేయకుండా ఉండటానికి మానవునిలో కావలసిన ధైర్య స్థయిర్యాలు కలగజేస్తాయి. ఈ ఆరాధనలే ముస్లింల గుర్తు. ఎవరయితే వీటిని నెరవేర్చరో వారిని గురించి, అసలు వారి హృదయంలో విశ్వాసం ఉందా లేదా అన్న అనుమానం కలగడం సబబే. విశ్వాసం కలిగివుండి కూడా ఈ ఆరాధనల పట్ల అశ్రద్ధ చేసేవారు తమ విశ్వాసాన్ని ఎప్పుడు వదలుకుంటారోనన్న భయం సదా ఉంటుంది. ఈ ఆరాధనలను ఇస్లాం మూలస్థంభాలు అనంటారు. వీటిమీదనే ఇస్లాం సౌధం నిలబడివుంది. ఈ స్తంభాలు పడిపోతే ఇస్లాం సౌధమే నిలువజాలదు. ఎవరయితే వీటిని వదిలేస్తున్నాడో అతను ఇస్లాం ప్రాసాదాన్నే కూల్చుతున్నాడన్నమాట. ఈ ఆరాధనలు నాలుగు★ (1) నమాజ్ స్థాపించటం (క్రమబద్ధంచేయటం) (2)

---

★ ఈ ఆరాధనలకు ముందు మానవుడు విశ్వాసం ప్రకటించి స్పష్టంగా తాను దేవుడు, దైవ ప్రవక్త చూపిన విధానాలను అంగీకరిస్తున్నట్లు తెలుపడం చాలా అవసరం. కలిమా (పవిత్ర వచనం) పఠించి మానవుడు ఈ మాటలనే

రోజా(ఉపవాసం) ఉండటం.(3) జకాత్ చెల్లించటం(4) హజ్(కాబాయాత్ర) చేయటం.

ఈమాన్ తర్వాత ముస్లింలపై తారసిల్లే మొట్టమొదటి విధి నమాజ్. స్పష్టంగా ఒక వ్యక్తి ముస్లిం అవడానికి గుర్తు. దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) కాలంలో ఎవరైనా నమాజ్ కొరకు మస్జిద్‌కు రాకపోతే అతన్ని అసలు ముస్లింగా పరిగణించేవారుకారు. "దైవదాసునికీ, దైవధిక్కారికి మధ్యతేడా నమాజ్ వదలడమే" అని ప్రవక్త (సఅసం) అన్నారు. అంటే ఎవరయితే నమాజ్ వదలిపెడతారో వారు కుఫ్ర్ (ధైవధిక్కారం)కు చేరువవుతారని భావం.

ఇస్లాం ఆదేశాల్లో నమాజ్ అన్నిటికంటే అధికంగా మహత్తుగల ఆదేశం. నమాజ్‌ను ఎటువంటి పరిస్థితిలోనూ వదలిపెట్టడానికి వీల్లేదు. రోగి లేవలేని పరిస్థితిలో ఉంటే పడుకునే సంజ్ఞలద్వారా నమాజ్ చేయాలని ఆదేశింపబడింది. ప్రయాణంలో ఉన్నా, రైల్లో ఉన్నా, ఓడలో ఉన్నా, ఇంట్లో ఉన్నా, అడవిలో ఉన్నా ఎలాంటి స్థితిలో ఉన్నా సరె నమాజ్ తప్పనిసరిగా చేయాలి. ఏడేండ్ల ప్రాయం పిల్లలచేత నమాజ్ చేయించాలి.

ఒకవేళ పదేళ్ళు గడిచిన పిల్లలు నమాజ్ చేయకపోతే నమాజ్ చేసేందుకు వాళ్ళను వత్తిడి చేయాలి. నమాజ్ చేయకపోతే కొట్టి అయినా చేయించాలి. ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్(రఅ) దృష్టిలో కావాలని ఒక్క నమాజ్ వదలివేసినా సరే మనిషి కాఫిర్ అవుతాడు. ఇమామ్ షాఫయీ(రఅ) నమాజ్ చేయనివానికి మరణదండన విధించాలని అంటారు. ఇమామ్ అబూ

---

స్వీకరిస్తున్నాడు. అందువల్ల ఇస్లాం సౌధానికి మూలస్తంభాలలో మొదటి స్తంభం కలిమా. 'అష్‌హదు అల్లాయిలాహ ఇల్లల్లాహు వ అష్‌హదుఅన్న ముహమ్మదుర్ రసూలుల్లాహ్'(అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధనకు అర్హులైన వారులేరని, ముహమ్మద్ అల్లాహ్ సందేశహరుడని నేను సాక్ష్యమిస్తున్నాను).

హనీఫా (రఅ) అభిప్రాయం ప్రకారం నమాజ్ చేయని వ్యక్తిని ఖైదులో నిర్బంధించాలి. పశ్చాత్తాపం చెంది తౌబా చెయ్యనంతవరకు అతన్ని జైలు లోనే ఉంచాలి. ఏ పని వదలినా నమాజ్ మాత్రం వదలకూడదని ముస్లిం అయిన ప్రతివ్యక్తికి ఆదేశం ఇవ్వబడింది. తీర్పుదినాన అన్నిటికంటే ముందు దేవుడు నమాజ్‌ను గురించే ప్రశ్నిస్తాడు. నమాజ్ చేయని వ్యక్తికి ప్రళయదినాన దైవానుగ్రహం లభించదు, ప్రపంచంలో గౌరవమూ ప్రాప్తంకాదు. ఎవరయితే అంతా తెలిసీ నమాజ్ చేయరో అలాంటి వారి హృదయాల్లో విశ్వాసం లేదు లేదా వారి విశ్వాసం చాలా బలహీనమయింది. వారు పైకి మేము అల్లాహ్‌ను మా స్వామిగా స్వీకరించామని అన్నప్పటికీ, ఆయన ఇచ్చిన అత్యంత ముఖ్యమైన ఆజ్ఞనే త్రోసి పుచ్చుతున్నారు. ఇలా వారు తామింకా అల్లాహ్‌ను తమ స్వామిగా, యజమానిగా స్వీకరించలేదని ఋజువు చేస్తున్నారు.

ఇస్లాంలో నమాజ్ చేయటానికి ఇంత ప్రాముఖ్యం ఎందుకు ఇవ్వ బడింది? దానిక్కారణం కూడా తెలుసుకోండి. అసలు విషయం ఏమిటంటే నమాజ్‌లేని జీవితం ఇస్లామీయ జీవితం అనిపించుకోదు. మానవుడు ఎట్టి పరిస్థితిలోనూ, ఎలాంటి విషయంలోనూ దైవాజ్ఞలకు వ్యతిరేకంగా ఏమీ చెయ్యకుండా ఉండటమే ఇస్లామీయ జీవితం అని మీరు ఇదివరకే తెలుసు కున్నారు. మనిషి నమాజ్‌లో మాటిమాటికీ ఈ విషయాలను ఒప్పుకుంటూ ఉంటాడుః నేను కేవలం అల్లాహ్‌కే దాసుణ్ణి, అల్లాహ్ దాస్యం చెయ్యడమే నా పని, నేను అల్లాహ్‌నే అందరికంటే గొప్పవానిగా భావిస్తాను. ఆయనే నా స్వామి, నా యజమాని, ఆయన సమక్షంలోనే నేను హాజరు కావలసి ఉంది. జీవితంలో చేసిన పనులన్నిటి లెక్కలూ చూపవలసివుంది. నేను దైవప్రవక్త (సఅసం) చూపిన మార్గాన్నే అనుసరిస్తాను. ఇవీ ఇంకా, ఇస్లాం స్వీకరించి అంగీకరించే సమస్త విషయాలూ నమాజ్‌లో మాటిమాటికీ పునరుక్తమవుతూ ఉంటాయి.

మీరే ఆలోచించండి, ఈ విషయాలను నమాజ్‌లో మాటిమాటికీ అంగీకరిస్తూనే మీరు ఏ విధంగా దైవాజ్ఞలను ఉపేక్షించగలరు? రోజుకు అయిదేసి పర్యాయాలు ఒకమాటను చెబుతూ, తిరిగి దానికి వ్యతిరేకంగా ఆచరించటం ఎలా సాధ్యం? రోజుకు ఐదుసార్లు నమాజ్ కోసం పిలువడం జరుగుతుంది. ఆ పిలుపు వినగానే ముస్లిం తన దైనందిన పనులన్నీ కొద్ది సేపు వదలిపెట్టి దైవ సన్నిధిలో ప్రవేశించి తన విశ్వాసానికి సానపెడ్తాడు. ఇలాంటి మనిషి ఎప్పటికీ అలక్ష్యం చేయడు. ఇలాంటివారే ఎప్పుడైనా ఏదయినా ధార్మికకార్యం కోసం పిలుపునిస్తే వెంటనే నడుంబిగించి సిద్ధమవుతారని ఆశించవచ్చు. అలాంటివారే తమబాధ్యతలేమిటో తెలుసు కుంటారు. ఇలాంటి వారే నిజానికి ఉపయోగకరమయిన వారు కూడా.

మాటిమాటికి దైవాన్ని జ్ఞాపకం చేసుకోవడం ద్వారా ఆయన గుణగణాలను గురించి యోచించటంవల్ల, ఆయన సన్నిధిలో చేతులు కట్టుకొని నిలబడటంచేత, ఆయన సమక్షంలో వంగడం, నేలమీద తలమోపి సాష్టాంగపడడం ద్వారా మన హృదయంలో అల్లాహ్ పట్ల ప్రేమ జనిస్తుంది, ఆయన అయిష్టం తాలూకు భయం కలుగుతుంది. ఈ స్థితి మనసులో కలగగానే మనిషి దైవాజ్ఞలను విని పరమ సంతోషంతో వాటి వైపుకు పరుగెత్తుతాడు. వాటికి భిన్నంగా ప్రవర్తించటానికి భయపడ్తాడు. ఈ విషయమే ఇస్లామీయ జీవితానికి ఊపిరిలాంటిది.

నమాజ్‌ను గురించి పై విషయాలు తెలిసిన తర్వాత మీ హృదయంలో ఒక అనుమానం రావచ్చు. మేము ఎంతో మంది నమాజ్ చేసేవాళ్ళను చూశాము. వారు నమాజ్ అయితే చేస్తారు కాని దైవాజ్ఞలను ఖాతరుచేయరు. ఇలా ఎందుకు జరుగుతుంది? అని మీరడగవచ్చు. దానికి కొన్ని కారణాలున్నాయి.

మొదటి కారణం, ఈనాడు మనచుట్టూ చెడు వ్యాపించి ఉంది.

'మంచి' అన్నది అణగి మణగి ఉంది, మన సమాజంలో పెత్తనం చెలాయించేవారు దైవాన్ని విశ్వసించనివారు, ఆయన ఆదేశాలంటే లక్ష్యపెట్టనివారు, ప్రభుత్వాధికారం కూడా దైవాజ్ఞలకు బదులు తమ సొంత ఆజ్ఞలను చెలాయించే వారి చెప్పు చేతల్లోనే ఉంది. అందువల్లనే జీవితపు సమస్తరంగాల్లో దైవాజ్ఞలను పాటించడం ఎంతో కష్టమయిపోయింది. ఒక మంచి సమాజంలో, ఒక ఉత్తమ పరిపాలనలో మనిషికి చెడు పనులు చేయటం ఏ విధంగా కష్ట సాధ్యమవుతుందో, అదే విధంగా దుష్టసమాజంలో చెడు పరిపాలనలో మంచి పనులు చేయటం కూడా కష్టతరమైపోతుంది. నమ్మకద్రోహం, మోసం, లంచం, అసత్యం, అశ్లీలం ఇంకా ఇలాంటివి ఎన్నో చెడుపనులు రేయింబవళ్ళు మన నలువైపులా జరుగుతున్నాయి. ఇటువంటి స్థితిలో తన శక్తినంతటినీ ప్రయోగించి, అందరికీ వేరుగా తన ఋజుమార్గంపైన నడవడానికి ప్రయత్నించే వాడు చెడులనుండి తప్పించుకోగలడు. బలహీనులు చెడు పనుల్లో చిక్కుకుంటారు. ఇలా చెడు పెరిగిపోతూ, మంచి క్షీణించిపోతూ ఉంది.

చాలా మంది దైవాజ్ఞలపై నడవాలనే కోరుకుంటారు. కాని సమాజం, ప్రభుత్వం తాము చూపే విధానాలపైనే నడవాలని వత్తిడి చేస్తాయి. ఈ వత్తిడికి అనేకమంది లొంగిపోయి దైవాజ్ఞలను వదలి పెడ్తారు. వారిలో కొంచెం కూడా నష్టాన్ని భరించి దైవాజ్ఞలను పాటించే ధైర్యం ఉండదు. ఇలాంటి బలహీనులు చిన్న చిన్న ప్రయోజనాలకోసం కూడా దైవాజ్ఞలను వదిలేస్తారు.

రెండవ కారణం, మనం చేసే నమాజ్‌లు నిజానికి అసలయిన నమాజ్‌లు కావు. అందువల్లనే మనకు కలగవలసిన ప్రయోజనాలు కూడా నమాజ్‌ల వల్ల కలగటం లేదు. మూడు విషయాలు నమాజ్‌కు ప్రాణం వంటివిః

1. మీరు మీ ప్రభువు ముందు నిలబడి వున్నారని, మీరు ఆయన్ని చూడలేక పోయినా ఆయనయితే మిమ్మల్ని చూస్తున్నాడన్న ధ్యాస మీకు ఉండాలి.
2. దేవుని ఎదుట మిమ్మల్ని మీరు ఎంతో చిన్నవారుగా, అధములుగా భావించుకోవాలి ఇంకా ఆయన గొప్పతనపు భావన మీ హృదయం నుండి ఎట్టి పరిస్థితిలోనూ దూరం కాకూడదు.
3. మీదీక్ష, ధ్యానం దేవునివైపే లగ్నమయి ఉండాలి. మీ హృదయంలో పరి పరి విధాల ఆలోచనలకు తావుండరాదు. ఆంతర్యం ఆయన ప్రేమతో నిండిపోవాలి.

ఈ విషయాలు నమాజ్‌లో ఎంత ఎక్కువగా ఉంటే ఆ నమాజ్ అంత సవ్యంగా, ఉత్తమంగా ఉంటుంది. ఇవి ఎంత హీనస్థాయిలో ఉంటాయో ఆ నమాజ్ కూడా అంత బలహీనమయిపోతుంది. నమాజ్ సవ్యంగా జరిగితే దాని ఫలితాలు కూడా మంచిగానే ఏర్పడతాయి. నమాజ్ బలహీనమయితే దానివల్ల కలిగే లాభాలు కూడా తక్కువగానే ఉంటాయి. కనుక ఈనాడు నమాజ్‌లవల్ల కలగవలసిన ప్రయోజనాలు మనకు ఎందుకు కలగటం లేదో ఇప్పుడు మీకు బోధపడి ఉంటుంది. మన నమాజులు చూడటానికి నమాజులుగానే కన్పిస్తాయి. కాని వాటిలో ప్రాణంలేదు. ఏ విధంగా ఒక ప్రాణంలేని శరీరం ఏమీ ఉపయోగపడదో అదే విధంగా మన ప్రాణంలేని నమాజ్‌లు కూడా మన జీవితాలను సరిదిద్దలేవు.

నమాజులను చక్కదిద్దటానికి, వాటి ద్వారా పొందవలసిన ప్రయోజనా లన్నీ పొందటానికి మనం ఏం చేయాలి? ఒక్కరోజులో మనం పరిస్థితు లన్నిటిని మార్చలేము లేక అవి వాటంతట అవే ఒక్కసారిగా మారజాలవు, అప్పుడు మనం ఏంచేయాలి? దీని గురించి కొన్ని విషయాలు మేము తెలుపగోరుతున్నాము.

1. సాధ్యమయినంతవరకు మీరు చేసే ప్రతి పని కేవలం దేవుని ఆదేశాలనే శిరసావహించాలి. ఆయన చూపిన చట్టాన్నే అనుసరించాలి. అనుక్షణం దైవ ప్రవక్త (సఅసం), ఆయన సహచరుల పవిత్ర జీవితాల ఆదర్శాన్ని ముందుంచుకోవాలి. వీలైనంత వరకు ఆ సత్పురుషులు చేసిన పనుల వంటివే చేస్తూ ఉండండి.
2. ఎవరయితే దైవాన్ని విశ్వసించరో, ఆయన ఆదేశాలపై నడవరో వారు చేసే ఏ పనిలో కూడా భాగస్వాములు కాకండి. ఏ పనులైతే దైవాన్ని కాదని, ఆయన ఆజ్ఞలను పక్కకు నెట్టివేయబడతాయో వాటిలో చేయూతనివ్వటం ముస్లింలకు తగదు.
3. సమాజాన్ని సంస్కరించటానికి, చెడ్డవారిని మంచిమార్గంపై తీసుకురావటానికి మీరు చేయగలిగినదంతా తప్పనిసరిగా చేస్తూనే వుండండి. దీన్ని గురించి వివరంగా ముందు తెలుసుకుంటారు.
4. నమాజ్‌లో మీరు ఏమేమి పఠిస్తారో వాటి భావం కూడా జ్ఞాపకం ఉంచుకోండి. దీన్ని గురించి కూడా రాబోయే అధ్యాయాల్లో తెలుసుకుంటారు. మీరు నమాజ్ చేస్తున్నప్పుడు మీ ప్రభువుతో ఏమంటున్నారో శ్రద్ధగా గమనించండి. చేతులు కట్టుకొని నిలబడినప్పుడు మీరు ఎవరి సమక్షంలో నిలబడ్డారో ఆలోచించుకోండి. అలాగే వంగినప్పుడు, నేల మీద తలమోపినప్పుడు మీరు ఏంచేస్తున్నారో ధ్యాస ఉంచండి. నమాజ్‌లో ఎంత ఎక్కువ దీక్ష వహించగలిగితే నమాజ్ అంతే ఉత్తమ రీతిలో పూర్తవుతుంది. పరధ్యానంగా, అర్థంచేసుకోకుండా నమాజ్ చేసే అలవాటును వీలైనంతవరకు రోజూ తగ్గించుకోవటానికి ప్రయత్నిస్తూ ఉండండి. ఈ పని క్రమక్రమంగా అవుతుంది. ఒంటరిగా కొన్ని నఫిల్ నమాజులు పూర్తి ధ్యానంతో చెయ్యండి. ఆ విధంగా వీలైనంత వుత్తమ రీతిలో నమాజ్‌చేసే అభ్యాసం చేస్తూ వుండండి.

5. మంచి నమాజ్‌కు, మంచి జీవితానికి అవినాభావ సంబంధం వుంది. మీరు చెడుపనులకు ఎంత దూరంగా వుంటారో మీ నమాజ్ కూడా అంత ఉత్తమంగా తయారవుతుంది. మీరు చేసే నమాజ్ ఎంత మంచిదయితే అంతగానే మీరు చెడుపనులకు దూరమవుతారు. మంచిపనులు చేస్తారు. మీ వల్ల ఏ విధమయిన చెడు జరగకుండా వుండేలా అనుక్షణం మీరు జాగ్రత్త తీసుకోండి. ఒకవేళ మరపువల్ల లేక పొరపాటువల్ల అలాంటిది ఏదైనా జరిగితే వెంటనే పశ్చాత్తాపం చెంది అల్లాహ్ వైపుకు మరలండి. చేసిన దానికి పశ్చాత్తాపంతో ఇకముందు అలాంటి పని చేయనని ప్రభువుతో వాగ్దానం చేయండి.

6 మీ నమాజును, మీ జీవితాన్ని సంస్కరించుకోటానికి ఎల్లప్పుడూ అల్లాహ్‌ను వేడుకుంటూ వుండండి. మంచిపనులు చేయటానికి ఆయన్నే సహాయం అర్థించండి.

## రోజా (ఉపవాసం)

ముస్లింలపై విధించబడిన రెండవ విధి ఉపవాసం. ఏ విషయాలైతే ప్రతిరోజూ నమాజులో ఐదుపూటలా మీకు జ్ఞాపకం చేయబడతాయో వాటినే ఉపవాస వ్రతం సంవత్సరానికొకసారి పూర్తి నెల దాక అనుక్షణం జ్ఞప్తికి తెస్తుంది. రమజాన్ మాసం రాగానే మీరు పగలు తినటం త్రాగటం మానేస్తారు. ఇక ఎంత ఆకలయినా, ఎంత దాహంవేసినా పగటిపూట మీరు ఏమీ ముట్టుకోరు. ప్రజల సమక్షంలో కూడా తినరు, ఒంటరిగా వున్నప్పుడు ఎవరూ మిమ్మల్ని చూడనిచోట కూడా తినరు. అలా ఎందుకు చేస్తారు? ఎవరు చూసినా, చూడకపోయినా దేవుడు మిమ్మల్ని చూస్తున్నాడని, ఆయన ప్రీతికోసం, ఆయన ఆదేశానుసారమే మీరు వుపవాసం ఉంటున్నారని మీకు గట్టినమ్మకముంది గనుక. ఏ వ్యక్తి మనసులోనైతే దేవుడు తనను

చూస్తున్నాడని, ఆయన ఆజ్ఞకు, ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా ఏపనీ చేయకూడదని దృఢ విశ్వాసం నాటుకుంటుందో అతను జీవితంలోని ఇతర వ్యవహారాలలో దైవప్రీతిని, దైవాజ్ఞలను దృష్టిలో పెట్టుకోడని మనం ఎలా అనుకోగలం? ఇస్లాం వుద్దేశ్యం అదే. ఇస్లాం మనిషిని యావత్తు జీవితంలో దేవుని విధేయుడిగా చేయకోరుతుంది.

ఇస్లాంలో రమజాన్ నెల పూర్తిగా ఉపవాసాలు వుండటం విధిగా నిర్ణయించబడింది. ఏదైనా అనివార్య పరిస్థితిలో కాక సాధారణంగా ఉపవాసం పాటించని వాడు ఘోరమైన పాపం చేసిన వాడవుతాడు. అల్లాహ్ ప్రయాణీకునికి, వ్యాధిగ్రస్తునికి అనుమతినిచ్చాడు. వారు ప్రయాణంలో లేక వ్యాధి కారణం వల్ల ఉపవాసం మానేసి, అలా ఎన్ని ఉపవాసాలు వదలివేయబడతాయో వాటిని ఆ తరువాత ఉపవాసం ఉండి పూర్తిచేసుకోవచ్చు. నిజమైన ఇస్లామీయ జీవితం గడపటానికి దేవుని అయిష్టం పట్ల భయపడటం, ఆయన ప్రసన్నత పొందాలన్న కోరిక కలగటం అవసరమని మీకు తెలుసు. ఈ విషయం ఉపవాసం ద్వారా లభ్యమవుతుంది. అయితే దానికి శ్రద్ధగా అర్థం చేసుకొని ఉపవాసం వుండటం చాలా అవసరం. ఇంకా ఉపవాస సమయంలో దైవాజ్ఞలకు వ్యతిరేకమైన పనేదీ చేయకూడదు. ఎవరైతే ఉపవాసాలను పాటించి దైవాజ్ఞలను ఏ మాత్రం లక్ష్యపెట్టరో, ఇష్టం వచ్చినది చేస్తూవుంటారో, అలాంటి వాళ్ళకు ఉపవాసం వల్ల ఎలాంటి లాభం కలగదు. దైవప్రవక్త (సఅసం) ఇలా అన్నారుః "ఎవరైనా రోజా పాటిస్తూ అబద్ధమాడటం, తప్పుడు పనులు చేయటం మానుకోకపోతే అలాంటివారు ఆహారపానీయాలు మానుకోవడం పట్ల అల్లాహ్‌కు ఏ మాత్రం ఆసక్తి, అవసరంలేదు.

"ఎందరో ఉపవాసవ్రతం పాటించే వారున్నారు. వారికి వారి ఉపవాసంవల్ల ఆకలిదప్పులు మినహామరేదీ ప్రాప్తంకాదు."

నమాజ్ లాగానే మన ఉపవాసాలు కూడా నిర్జీవమైనాయి. దీనికి కూడా నమాజ్ విషయంలో చెప్పబడిన కారణాలే వర్తిస్తాయి. ఏ పనైనా అర్థంచేసుకోకుండా, అశ్రద్ధగాచేస్తూ ఉంటే వాస్తవంగా కలగవలసిన ప్రయోజనాలేవీ కలగవు.

## జకాత్

ముస్లిం మీద విధించబడిన మూడవ విధి జకాత్ చెల్లించటం. ఖుర్‌ఆన్‌లో పెక్కుచోట్ల జకాత్ ఇవ్వమని ఆదేశించబడింది. జకాత్ ఇవ్వటం ముస్లింకు గుర్తింపుగా తెలియజేయబడింది. జకాత్ కేవలం ధనికుల మీద విధిగా నిర్ణయించబడింది. మీ దగ్గర ఒక సంవత్సరం పూర్తి అయ్యేవరకు జకాత్ చెల్లించడానికి కావలసినంత సంపద వుంటే, అందులో ఒకభాగం మీ పేద సోదరుల కొరకు కేటాయించవలసి వుంటుంది.★ ధన వ్యామోహం మనిషిలో అనేక చెడులను జనింపజేస్తుంది. నిజం చెప్పాలంటే వేలాది ఉపద్రవాలకు మూలం ధనవ్యామోహమే. ఇస్లాం తన అనుయాయుల హృదయాలలో ధన వ్యామోహం వుండటాన్ని సమ్మతించదు. ధన వ్యామోహం వల్ల, ధనాన్ని కూడబెట్టటం వల్ల ఎన్నిచెడులు పుట్టుకొస్తున్నాయో ఈనాడు మనం చూస్తూనే ఉన్నాం. ధనం, ఐశ్వర్యం స్వతహాగా చెడు వస్తువులేమీ కాదు. అవి దైవం ప్రసాదించిన వరాలు, కాని మానవుడు వాటి వ్యామోహంలోపడి వాటిని దుర్వినియోగపరచడం లేక దాన్ని కూడబెట్టడం వలనే సమాజానికి పెద్ద జాడ్యమైపోతుంది. సరయిన విధానాల ద్వారా ధనార్జనను అల్లాహ్ నిషేధించలేదు, లేక ఇస్లాం ధనవంతుడిని చెడ్డవానిగా

---

★ దీన్ని గురించి కొన్ని ముఖ్యవిషయాలు రాబోయే అధ్యాయంలో తెలియజేయబడతాయి.

భావించదు. కాని అది ముస్లిం హృదయంలో ధనవ్యామోహం ఉండటాన్ని మంచిదిగా భావించదు. ఇతరులు ఆకలితో మాడి చచ్చిపోయేవిధంగా సంపద ఏ ఒక్కరిదగ్గర పేరుకొని ఉండరాదని ఇస్లాం కాంక్షిస్తుంది. అందుచేతనే అది దైవప్రీతి కోసం ధనం ఖర్చుపెట్టడాన్ని ఎంతో ప్రోత్సహిస్తుంది. అది ముస్లింల హృదయాల్లో పరలోక ప్రయోజనాల పట్ల ప్రేమను ఎంతో గట్టిగా నాటుతుంది. ఆ తరువాత అతని హృదయంలో ధన వ్యామోహం ఏ మాత్రం మిగలదు. ఒక పెట్టుబడిదారునికి ఆస్తి కూడబెట్టటంలో ఎంత ఆనందం కలుగుతుందో, ఒక ముస్లింకు దైవం మెప్పుకోసం సంపద ఖర్చుపెట్టటంలో అంతకంటే ఎక్కువ ఆనందం కలుగుతుంది. ముస్లింల హృదయాల్లో నుంచి ధన వ్యామోహం దూరం చేయటానికి అల్లాహ్ వారిపై జకాత్ విధించాడు.

జకాత్ చెల్లించే సరైన పద్ధతి ఇదిః ఇస్లామీయ ప్రభుత్వం ముస్లిం నుండి జకాత్ వసూలుచేసి, జకాత్ తీసుకోటానికి అర్హులయినవారికి అందజేస్తుంది. ఏ సమాజంలో అయితే జకాత్ వసూలుచేయటానికి, దాన్ని పంచటానికి సరైన ఏర్పాట్లు ఉంటాయో అక్కడ ఏ ఒక్కడూ నిరుపేదగా, అగత్యపరునిగా ఉండలేడు. జకాత్‌లో పేదవాళ్ళకు, వికలాంగులకు సహాయం చేయబడుతుంది. రుణగ్రస్తులకు రుణభారం నుంచి విముక్తి కలిగించబడుతుంది. బాటసారులకు సహాయం చేయబడుతుంది. ఇంకా ఇలాంటి కార్యాల్లో డబ్బు వినియోగింపబడుతుంది.

డబ్బు, సంపద, ఆభరణాలు, పొలాలు, తోటలు, పశువులు అన్నిటికీ జకాత్ విధించబడుతుంది. వాటన్నిటి నియమాలు వేర్వేరుగా ఉన్నాయి. వీటిని మీరు ఇతర పుస్తకాల ద్వారా గాని లేక తెలిసిన వారి ద్వారా గాని గ్రహించవచ్చు.

## హజ్ (కాబా యాత్ర)

ముస్లిం నాల్గవ విధి కాబాయాత్ర చేయటం. ఎవరైతే కాబా వరకు పోయిరావటానికి కావలసిన ఖర్చు భరించగలడో అతను జీవితంలో కనీసం ఒకసారి హజ్‌కు తప్పనిసరిగా పోవాలన్నది ఇస్లాం ఆదేశం.

అరేబియాలోని మక్కా నగరంలో హజ్రత్ ఇబ్రాహీం (అస) దైవాజ్ఞతో దైవారాధన కోసం ఒక ఆలయం నిర్మించారు. దాని పేరే కాబా. ముస్లింలు దాని వైపుకే తిరిగి నమాజ్ చేస్తారు. కాబా చుట్టు ప్రదక్షిణం చేయటం, అక్కడికెళ్ళి నమాజ్ చేయటం, కాబా సమీపంలో ఉండే ఇతర పవిత్ర స్థలాలకు పోయి అల్లాహ్‌ను ప్రార్థించటం, ఖుర్బాని చేయటం మొదలైన వాటిని నెరవేర్చటాన్నే "హజ్" అంటారు. ఇస్లాం ఆరాధనల్లో హజ్‌కు గొప్ప స్థానముంది, దాని వల్ల మనసులో దైవ ప్రేమ, దైవధర్మం కొరకు ధనం, ప్రాణం సర్వం ధారపోయాలనే ఉత్తేజం జనిస్తుంది.



# ఆరాధనా పద్ధతులు

ఇస్లాంలో ప్రత్యేక ఆరాధనలు నాలుగని మీకు ఇంతకు ముందు చెప్పబడింది, (1) నమాజ్ (2) రోజా (3) జకాత్ (4) హజ్. ఇప్పుడీ ఆరాధనలను ఆచరించే విధానాలను తెలుసుకుందాం.

## నమాజ్

మొదట నమాజ్‌ను తీసుకోండి. నమాజ్ చేయటానికి అన్నిటికంటే ముందు శరీరం, బట్టలు పరిశుభ్రంగా ఉండాలి. అంచేత మొదట పరిశుద్ధతను గురించి కొన్ని ముఖ్యవిషయాలు తెలుసుకోండి.

## తహారత్ (శుచీ, శుభ్రత)

తహారత్ అంటే పరిశుభ్రత, పరిశుద్ధత, మాలిన్యాలు తొలగించటం అని అర్థం. మాలిన్యం రెండు విధాలు. ఒకటి కన్పించేది. మలమూత్రాలు, పేడ, రక్తం, చీము వగైరాల్లాంటి మలినాలు. రెండవ రకమైన మాలిన్యం కంటికి కన్పించనిది. అయితే అది కనిపించకపోయినా దాన్ని తొలగించాలని ఆదేశించడమైనది. ఉదాహరణకు వుజూ భంగమవడం, స్నానం చేయవలసిన అవసరం కలగడం. నమాజ్ చేయటానికి ముందు పై రెండు విధాలైన మాలిన్యాల నుండి పరిశుద్ధమవడం అవసరం. దేహం మీదగాని, బట్టలమీద గాని కన్పించే మలినం ఏదైనా అంటుకొని వుంటే దాన్ని కడిగి వేయాలి. వుజూ చేయకపోతే వుజూ చేయాలి. స్నానం అవసరమయితే స్నానంచేయాలి.

## ఇస్తింజా

మల మూత్రాల విసర్జన తర్వాత ఆయా అవయవాలను పరిశుభ్ర పరచటం అవసరం. దీన్ని 'ఇస్తింజా' అంటారు. మొదట ఆ శరీర భాగాన్ని మట్టి పెడ్డతో శుభ్రం చేసి తర్వాత నీళ్ళతో కడిగి పరిశుభ్రం చేసుకోవాలి. కేవలం నీటితో పరిశుభ్రపరచుకున్నా సరిపోతుంది.

## వుజూ

నమాజ్ చేయటానికి ముందు ముఖం చేతులూ కడుక్కొని పరిశుభ్రం అవటాన్ని వుజూ అంటారు. వుజూలో నాలుగు విషయాలు ఫర్జ్ (విధి) అయినవి

1) ముఖమంతా కడగటం–నుదుటిపై తల వెంట్రుకల నుంచి గడ్డం క్రిందివరకు, ఒక చెవి నుంచి రెండవ చెవి వరకు.
2) రెండు చేతులను మోచేతులతో పాటు కడగటం.
3) కనీసం తల నాల్గవ భాగాన్ని మసహ్★ చేయటం.
4) రెండు కాళ్ళు చీలమండలతో పాటు కడగటం.

ఈ నాల్గింటిలో ఏ ఒక్కటయినా వెంట్రుక మందం తడవక పోయినా వుజూ అవదు.

## వుజూ చేయవలసిన పద్ధతి:

1) మొదట బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్ పఠించండి. తర్వాత రెండు చేతులను మణికట్టుల వరకు మూడు సార్లు కడుక్కోండి.
2) మూడు సార్లు పుక్కిలించండి. మిస్వాక్★★ తో పల్లు శుభ్రపరచుకోండి. అది లేకపోతే వ్రేలి తోనే పల్లు, నోరు పరిశుభ్రం చేసుకోండి.

---

★ 'మసహ్' అంటే తడి చెయ్యి లేక చేతులతో ఆయా శరీరభాగాన్ని తడపడం అని భావం.

★★ మిస్వాక్= పలుదోము పుల్ల.

3) మూడుసార్లు ముక్కులో నీళ్ళు పోనిచ్చి శుభ్రంగా చీదండి.
4) మూడుసార్లు ముఖం కడుక్కోండి- ముంగురులు మొదలుకొని గడ్డం క్రిందివరకు, ఒక చెవి నుండి రెండవ చెవివరకు.
5) ముందు రెండు చేతులను మోచేతులతో పాటు తడి చేతులతో రుద్ది, ఆ తర్వాత మూడేసిసార్లు వాటిమీద నీళ్ళుపోసి శుభ్రపరచండి.
6. రెండు చేతులను మరోసారి తడిచేసుకొని అరచేతులకు వ్రేళ్ళకు వున్న తడి వెంట్రుకలకు తగిలేటట్లు ముందువైపునుండి వెనుకదాక తలపై మసహ్ చెయ్యండి. తర్వాత ఆ తడి చేతుల చూపుడు వ్రేళ్ళతో, బొటనవ్రేళ్ళతో, రెండు చెవుల లోపల, వెలుపల శుభ్రం చేసి, అరచేతులు తిరగేసి మెడకు రెండు వైపులా పోనిచ్చి మెడను శుభ్రంచేయండి.
7) రెండు కాళ్ళను చీలమండలతోపాటు మూడు సార్లు కడగండి.

వుజూ చేస్తున్నప్పుడు ప్రతిసారీ మొదట కుడి అవయవాన్ని కడిగి ఆ తర్వాత ఎడమ అవయవాన్ని కడగాలి. వీలైతే కాబా వైపుకు తిరిగి కూర్చోండి. ప్రతి అవయవాన్ని మొదటిసారి శుభ్రపరచిన పిదప బాగారుద్దండి. నీటి చుక్కలు మీద పడకుండా ఉండేందుకు వుజూ కోసం ఎత్తయిన స్థలం మీద కూర్చోండి, వుజూ చేస్తూ మాట్లాడటం మంచిదికాదు. మీ ధ్యాసంతా నమాజ్ వైపుండాలి.★

వుజూ భంగమవడానికి అంటే మనిషికి వుజూ లేకుండా పోవటానికి కాగల కారణాలు క్రింద పేర్కొనబడుతున్నాయి.

1) మలం లేక మూత్రం విసర్జించటం.

---

★ ఎవరైనా తెలిసినవారి సమక్షంలో రెండు మూడుసార్లు వుజూ చేసి చూపించాలి. ఏవయినా పొరపొచ్చాలు వుంటే వాటిని దిద్దుకోవడానికి సాధ్యపడుతుంది.

2) అపానవాయువు పోవటం,
3) మలమూత్రాల అంగాలనుంచి మరేదైనా స్రవించడం.
4) శరీరంనుండి రక్తం, చీము రావటం.
5) నోటినిండా వాంతిచేసుకోవటం.
6) పడుకొని లేక దేనికయినా ఆనుకొని నిద్రించటం
7) నమాజ్‌లో పెద్దగా నవ్వటం.
8) ఉమ్ము ఎఱ్ఱగా మారేటంతటి రక్తం నోటి నుండి స్రవించడం.

## స్నానం

స్నానం లేక గుసుల్ చేయటంలో మూడు ఫర్జ్ (విధి) లున్నాయి. వాటిలో ఏ ఒక్కటయినా వెంట్రుకమందం వదిలేసినా లేక పొడిగా వుండిపోయినా స్నానం పూర్తికాదు. మనిషి అపరిశుభ్రంగా వుంటాడు.

1) పుక్కిలించటం.
2) ముక్కులో నీరు పోనిచ్చి చీది శుభ్రం చేయటం.
3) శరీరమంతా నీళ్ళు ప్రవహింపజేయడం, వెంట్రుకల కుదుళ్ళదాక, గోళ్ళ లోపలిదాకా నీళ్ళుపోయడం, స్త్రీలు ఏ కారణం వల్లనైనా జడలేక కొప్పు విప్పలేకపోయినా ఫరవాలేదు. తల వెంట్రుకల కుదుళ్ళకు నీళ్ళు పోనిస్తే చాలు. పురుషులు మాత్రం తల వెంట్రుకల్ని విడదీసి వాటి కుదుళ్ళ వరకు నీళ్ళు పోయేలా శుభ్రపరచడం మాత్రం తప్పనిసరి.

## స్నానం చేసే పద్ధతి:

మొదట రెండు చేతులను మణికట్ల దాకా కడగాలి. తర్వాత శరీరంమీద ఎక్కడెక్కడ మలినం ఉందో అక్కడ శుభ్రంగా కడిగివేయాలి. వుజూలో మాదిరిగా పుక్కిలించాలి, ముక్కులో నీళ్ళుపోనిచ్చి శుభ్రపరచాలి.

తరువాత ఒకసారి శరీరమంతా నీళ్ళుపోసుకొని వెంట్రుకమేర కూడా వదలకుండా వళ్ళు తోముకోవాలి. ఆ తర్వాత ఒంటిమీద బాగా నీళ్ళు పోసుకోవాలి.

ఏ కారణాల వల్ల స్నానం చేయడం వాజిబ్(తప్పనిసరి) అవుతుందో అవి ఇక్కడ తెలియజేయబడుతున్నాయి.★

1) నిద్రలో లేక మెలకువలో వీర్య స్ఖలనం జరగడం, మెలకువలో ఏ కారణం చేతనైనా ఎలాంటి ఉద్రేకం లేకుండా వీర్య స్ఖలనం జరిగితే స్నానం చేయడం వాజిబ్అవుతుంది.

2) సంభోగ క్రియలో కేవలం పురుషాంగం యొక్క ముందు భాగం (శిశ్నం)లోనికి పోయినా స్త్రీ పురుషులిద్దరూ స్నానం చేయడం వాజిబ్ (అవసరం) అవుతుంది.

3) ఋతుస్రావం, పురిటిరక్తం ఆగిపోగానే స్త్రీ స్నానం చేయటం వాజిబ్ అవుతుంది.

## నీరు

కొన్ని రకాలనీళ్ళు శుచి శుభ్రత కోసం వినియోగించవచ్చు, వాటితో బట్టలుతకవచ్చు, స్నానం చేయవచ్చు, వుజూ చేయవచ్చు. ఉదా. (1)వర్షపు నీరు (2) చెలమ నీరు (3) బావి నీరు (4) నది నీరు (5) సముద్రపు నీరు (6) కరిగిన మంచు లేక వడగళ్ళ నీరు. (7) చెరువు లేక కోనేటి నీరు. అది కనీసం ముప్పయి చదరపు గజాల విస్తీర్ణం, జానెడు కన్నా యెక్కువ లోతు గలదిగా ఉండాలి.

ఎలాంటి నీళ్ళయితే ఉతకటానికి, కడగటానికి, పరిశుభ్రం చేయటానికి, వుజూ చేయటానికి, స్నానం చేయటానికి పనికిరావో అలాంటి వాటిని దిగువన పేర్కొంటున్నాము:

---

★ మీరు ఇష్టంవచ్చినప్పుడు స్నానం చెయ్యడంలో తప్పులేదు కాని స్నానం చెయ్యడం 'వాజిబ్' అయినప్పుడు స్నానం చెయ్యకుండా నమాజ్ చెయ్యడానికి, దివ్యఖుర్‌ఆన్ పఠించడానికి, దాన్ని ముట్టుకోడానికి అనుమతిలేదు.

1) ఏదయినా కాయను, చెట్టును పిండి తీసిన రసం లేక మందులు, ఇతర వస్తువులు కాచి తీసిన సారం.
2) ఏదయినా పరిశుద్ధమయిన వస్తువు కలిసిపోవటం వల్ల రంగు, రుచి వాసన మారిపోయి, చిక్కగా మారిన నీరు. నీరుచిక్కగా మారకపోతే ఆ నీటినివాడవచ్చు. ఉదాహరణకు నదుల్లో ప్రవహించే మట్టిగలసిన నీరు, ఎల్లి మందు కలపబడిన బావి నీరు, మొగలి, రోజా లాంటి పన్నీరు కలిపిన నీరు.
3) అపరిశుద్ధ వస్తువు పడిన లేక ఏదైనా జంతువు పడి చచ్చిపోయినా కొద్దిపాటి నీరు. ప్రవహించని నీటిని, పెద్ద చెరువు లేక పెద్ద కోనేటికంటే తక్కువగా ఉన్న నీటిని కొద్దిపాటి నీరు అంటారు. ఉదాహరణకు బావి, చిన్న ట్యాంకి, గాబు లేక కుండ నీళ్ళు. ఇలాంటి నీళ్ళలో కొంత పేడ, మూత్రం లేక ఇతర అపరిశుద్ధ వస్తువులు పడితే అవి అపరిశుద్ధమవుతాయి.
4) పారే నీళ్ళను పెద్ద చెరువు లేక పెద్ద కోనేటి నీళ్ళను చాలా నీరు అంటారు. ఇలాంటి నీళ్ళలో ఏదైనా అపరిశుద్ధ వస్తువు కలిసిపోయి దాని ప్రభావం కనపడి నీటి రంగు లేక రుచి మారినా లేక వాసన వచ్చినా ఆ నీళ్లు కూడా అపరిశుద్ధమయినవిగా పరిగణించబడతాయి.
5) ఒకసారి వాడిన నీరు కూడా తిరిగి పరిశుద్ధపరచటానికి వుపయోగపడదు. ఉదాహరణకు వుజూ చెయ్యగా పారిన నీరు, లేక స్నానం చేయగా పారిన నీరు. దీన్ని తిరిగి వినియోగించరాదు.
6. ఏ జంతువుల మాంసం హరామో (నిషేధమో) దాని ఎంగిలి నీరు కూడా అపరిశుద్ధమైందే.★ ఉదాహరణకుః- పంది, కుక్క, తోడేలు, సింహం మున్నగు జంతువుల ఎంగిలి నీళ్ళు. పిల్లి ఎలుకనుతిన్న

★ ధర్మ యుక్తమైన జంతువుల ఎంగిలి నీరు పరిశుద్ధమైనదే.

వెంటనే నీటిని ఎంగిలి చేస్తే అవి కూడా అపరిశుభ్రమైనవే. అలాగే సారాయి త్రాగిన వ్యక్తి ఆ వెంటనే నీళ్ళు తాగితే, అతని ఎంగిలి నీరు కూడా అపరిశుద్ధమవుతాయి. అయితే సాధారణంగా ఏ మానవుని ఎంగిలి అపరిశుద్ధం కాదు. అతను ముస్లిం అయినా, ముస్లిమేతరుడు అయినా, అంటరాని వాడనబడే వాడయినా.

7. పిల్లి ఎంగిలి చెయ్యక పూర్వమే ఎలుకను తినకుండా ఉన్నట్లయితే దాని ఎంగిలి, కోడి ఎంగిలి నీళ్ళు మలినాలను తినే ఆవు, గేదెల ఎంగిలి నీళ్ళు, కాకి లేక గద్ద ఎంగిలి చేసిన నీళ్ళు అపరిశుద్ధమయినవైతే కావు కాని, అనివార్య పరిస్థితుల్లో తప్ప అలాంటి నీళ్ళు వాడటం శ్రేయస్కరం కాదు.

8. కొద్దిపాటి నీటిలో శరీరంలో రక్త ప్రసరణ కలిగిన ఏ జంతువు పడి చనిపోయినా ఆ నీరు కూడా అపరిశుద్ధమవుతాయి. ఉదాహరణకు పిచ్చుక, కోడి, పిల్లి, ఎలుక వగైరా. ముప్పయి చదరపు గజాల వైశాల్యానికి తక్కువగా ఉన్న కోనేరు, చిన్న చెరువు, బావి, ట్యాంకి, గాబు లేక కుండ మొదలైన వాటి నీటిని కొద్దిపాటి నీరు అంటారు. చేప, కప్ప వగైరా నీటి జంతువులు నీళ్ళలో చనిపోతే ఆ నీరు అపరిశుద్ధం కావు. అట్లాగే చీమ, దోమ, ఈగ నీటిలో పడిచస్తే ఆ నీళ్ళు కూడా అపరిశుద్ధం కావు.

కొద్దిపాటి నీరు అపరిశుద్ధమయితే వాటిని శరీర అవయవాలు పరిశుభ్రపరచు కోవటానికి, బట్టలుతకటానికి, వుజూ స్నానం చేయటానికి ఉపయోగించరాదు. ఇలాంటి నీటిని పరిశుద్ధపరచటమూ సాధ్యపడదు. కాని బావి నీరు అపరిశుద్ధమైతే వాటిని పరిశుద్ధపరచు కోవచ్చు. ఆ పద్ధతి ముందు వస్తుంది.

## బావి నీరు ఎలా అపరిశుద్ధమవుతాయి

ఈ క్రింది కారణాల వల్ల బావి నీరు అపరిశుద్ధమవుతాయిః-

1) మూత్రం, పేడ లేక అలాంటివే ఇతర అపరిశుద్ధ వస్తువు ఏదైనా పడితే
2) ఏ జంతువుల ఎంగిలి అపరిశుద్ధమయినదో అలాంటి జంతువు, ఉదాహరణకు, పంది, కుక్క, తోడేలు, సింహం ఇత్యాదివి పడిపోతే- అది ప్రాణంతో బయటికి వచ్చినా సరే.
3) శరీరంలోని రక్తప్రసరణ కలిగిన ఏ ప్రాణి అయినా పడి చచ్చిపోయినా లేక చచ్చి పడిపోయినా ఉదాహరణకు బల్లి, పిల్లి, ఎలుక, మేక మున్నగు జంతువులు.
4) వంటి మీద మలినం లేక అపరిశుద్ధ పదార్థం ఏదైనా అంటుకొని ఉన్న జంతువు పడిపోయినా లేక అది బావిలో పడి మల మూత్ర విసర్జన చేసినా అది ప్రాణంతో బయటపడినా సరే.

## బావి నీటిని పరిశుద్ధపరిచే విధానం

అ) ఈ క్రింద పేర్కొనబడిన విషయాలలో ఏదైనా సంభవిస్తే బావిలో ఉన్న నీరంతా తోడేయాలి. ఒకవేళ బావి మరీ పెద్దదయితే, ఎంత తోడినా ఆగని ఊట ఉన్నట్లయితే అందులో నుండి రెండొందల నుండి మూడొందల బకెట్లు* దాకా నీరు తోడి పారబోయాలి.
1) బావిలో మలమూత్రాలు లేక పేడ వంటి అపరిశుద్ధ పదార్థాలు పడిపోతే లేక అపరిశుద్ధ పదార్థాలు దేహానికి అంటుకొనివున్న ప్రాణి ఏదైనా పడితే,
2) మనిషి పడిపోయి చనిపోతే
3) పంది, కుక్క, తోడేలు, సింహం వగైరా ఏదైనా జంతువులు పడి బ్రతికి బయట పడినా లేక చచ్చిపోయిన తరువాత తీసేసినా....

---

★ బకెట్లంటే ఇక్కడ ఆ బావిలో నీళ్ళు తోడడానికి వినియోగించే బుంగ, బొక్కెన మరే సాధనమయినా కావచ్చు. అంతకంటే పెద్దదో చిన్నదో అవసరంలేదు.

4) మేక, మేక అంతటివి లేక అంతకంటే పెద్ద "హలాల్" జంతువులు పడిపోయి చస్తే లేక చిన్న చిన్న జంతువులు ఒకటికి మించి పడి చచ్చినా – ఉదాహరణకు రెండు పిల్లులు వగైరా.

5) రక్తప్రసరణ గల ఏదైనా చిన్న ప్రాణి పడి చచ్చిపోయి ఉబ్బితే లేక చిట్లిపోతే (ఉదా. ఎలుక, బల్లి మొదలైనవి).

(ఆ) పిల్లి, కోడి, పావురాయి లేక వాటంతటి ప్రాణి ఏదైనా పడి చచ్చిపోయిన తర్వాత, ఉబ్బి చిట్లి పోకముందే దాన్ని బయటికి తీస్తే, అప్పుడు నలభై నుండి అరవై బకెట్ల నీరు తీసేస్తే బావి నీళ్ళు పరిశుద్ధమవుతాయి.

(ఇ) బల్లి, ఎలుక, పిచ్చుక లేక వాటంతటి ప్రాణి ఏదైనా పడి చచ్చిపోయిన తర్వాత ఉబ్బి చిట్లిపోక ముందే దాన్ని బయటికి తీసి, ఇరవై నుండి ముప్పై బకెట్ల నీళ్ళు తోడి పారేస్తే ఆ బావి నీళ్ళు పరిశుద్ధమవుతాయి.

## తయమ్ముం

ఒక్కోసారి నీళ్ళే దొరకవు. ఒక్కోసారి మనిషి వ్యాధిగ్రస్తుడై నీళ్ళతో వుజూ లేక స్నానం చేస్తే వ్యాధి అధికమయ్యే ప్రమాదం ఉంటుంది. ఇలాంటి పరిస్థితుల్లో స్నానం, వుజూ చేయటానికి బదులు తయమ్ముం చేసుకునేందుకు అనుమతి ఉంది. తయమ్ముం చేసే విధానం ఇది:-

పరిశుద్ధమయ్యే సంకల్పంతో మొదట రెండు చేతులను పరిశుభ్రమయిన మట్టిపైన తట్టాలి. ఆ చేతులతో ముఖమంతా స్పర్శించాలి. అలా స్పర్శించేటప్పుడు వెంట్రుక మందం కూడా వదలకుండా స్పర్శించాలి. మళ్ళీ రెండవసారి మట్టిపైన చేతులు తట్టి చేతి వ్రేళ్ళ నుండి మోచేతుల వరకు వెంట్రుక మందం కూడ వదలకుండా స్పర్శించాలి. ఇదే "తయమ్ముం" అంటే. స్నానం చేయవలసివచ్చినా, వుజూ చేయవలసి వచ్చినా రెండు పరిస్థితుల్లో కూడా ఇదే విధంగా తయమ్ముం చేసి మనిషి పరిశుద్ధమవుతాడు. ఇప్పుడతను నమాజ్ చేయవచ్చు.

తయమ్ముం చేయటానికి ఉపయోగించదగిన పదార్థాలుః-పరిశుభ్రమైన మట్టి, ఇసుక, రాయి, సున్నం, మట్టిపాత్రలు, ఇటుకలు, రాతి లేక ఇటుకగోడ, దుమ్ముపడిన బట్టలు లేక కలప మొదలయినవి.

తయమ్ముం చేయటానికి సరయిన కారణాలు కాగల పరిస్థితులుః-

1) నీళ్ళు కనీసం ఒక మైలు దూరంలో ఉన్నప్పుడు.
2) నీళ్ళు సోకడం వలన వ్యాధి అధికమయ్యే ప్రమాదం వున్నప్పుడు.
3) నీళ్ళదగ్గర అపాయకరమైనది ఏదైనా వున్నప్పుడు. ఉదాహరణకు శత్రువు లేక నష్టపరిచే ప్రాణి ఏదైనా వున్నప్పుడు.
4) బావిలో నుంచి నీళ్లు తోడటానికి ఏ సాధనమూ లేనప్పుడు.
5 నీళ్లు తాను తీసుకోలేని లేక అందించే వారు కూడా లేని క్లిష్టపరిస్థితి ఎదురయినప్పుడు.

ఏ కారణాల వల్ల వుజూ భంగమైపోతుందో ఆ కారణాల వల్లనే తయమ్ముం కూడా భంగమైపోతుంది. ఇంకా, నీళ్ళు లభించినప్పుడు లేదా అనివార్య పరిస్థితి తొలగిపోయినపుడు కూడా తయమ్ముం భంగమై పోతుంది.

## నమాజ్ చేసే విధానం★

మొదట మీకిక్కడ రెండు రకాతుల నమాజ్ చేసే విధానం తెలుపుతున్నాం. వుజూ చేసిన తర్వాత కాబా ★★ దిశకు తిరిగి నిలబడండి.

ఏ దిశ వైపుకయితే తిరిగి నమాజ్ చేస్తామో ఆ దిక్కును "ఖిబ్లా" అనంటారు.

---

★ నమాజ్ చేసే విధానం ఎవరయిన తెలిసిన వారి ద్వారా కూడా నేర్చుకోవాలి. అలాగే నమాజ్‌లో పఠించే స్మరణలు, వచనాలు తెలిసిన వారికి వినిపించి సరిచేసుకోవాలి. కేవలం వ్రాసివున్న దాన్ని చూసి కంఠస్థం చేయటం వల్ల ఏదైనా మాట తప్పుగా నేర్చుకునే ప్రమాదముంది.

★★ కాబా గురించి మీరు హజ్ వివరణలో చదివి ఉన్నారు.

అన్నిటికంటే ముందు అల్లాహు అక్బర్ (అల్లాహ్ అందరి కంటే గొప్పవాడు) అంటూ రెండు చేతులను చెవులవరకు ఎత్తి నాభికింద కట్టు కోండి. చేతులు ఎత్తేటప్పుడు వ్రేళ్ళను పూర్తిగా చాపి అరచేతులు ఖిబ్లా వైపుకు వుండేటట్లు చూడండి. చేతులు కట్టుకునేటప్పుడు ఎడమచేతిని క్రింద వుంచి దాని మణికట్టును కుడిచేతి బొటన వ్రేలు మరియు చిటికన వ్రేలితో పట్టుకొని మిగిలిన మూడు వ్రేళ్ళు ముంజేతిపై చాచి వుంచండి. నిలబడి అటూ ఇటూ దిక్కులు చూడకూడదు. మీ దృష్టి అంతా సజ్దా చేసే చోట నిలపాలి. ఇప్పుడు పఠించండి.★

*"సుబ్హాన కల్లాహుమ్మ వ బిహమ్దిక వ తబార కస్ముక వ తఆలా జద్దుక వ లా ఇలాహ గైరుక్"*

అల్లాహ్! నీవు పరమ పవిత్రుడవు. స్తోత్రములు నీకే. నీ పేరు శుభప్రదమయింది. నీ గొప్పతనం అత్యున్నతమయింది. నీవు తప్ప ఆరాధింప తగినవాడెవడూ లేడు.

ఆ తర్వాత ఇలా చదవండిః-

*"అవుజు బిల్లాహి మిన షైతా నిర్రజీమ్"*

శాపగ్రస్తుడైన షైతాన్ బారి నుండి రక్షణ పొందుటకై అల్లాహ్ శరణు కోరుతున్నాను,

*"బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్"*

కరుణించేవాడు, కనికరించేవాడు అయిన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

ఇప్పుడు ఫాతిహా సూరాను పఠించండిః-

---

★ కేవలం అరబ్బీ పదాలనే పఠించాలి. నమాజ్‌లో పఠించేదంతా మీరు అర్థం చేసుకునేందుకు తెలుగులో వాటి భావం వ్రాయబడింది.

**"అల్‌హమ్‌దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్. అర్రహ్‌మా నిర్రహీమ్. మాలికి యౌమిద్దీన్. ఇయ్యాక నాబుదు వ ఇయ్యాక నస్తయీన్. ఇహ్‌ది నస్సిరాతల్ ముస్తఖీమ్. సిరాతల్లజీన అన్ అమ్‌త అలైహిమ్ గైరిల్ మగ్‌జూబి అలైహిమ్ వ లజ్జాల్లీన్"... (ఆమీన్)**

స్తోత్రములు అల్లాహ్ కొరకే. ఆయన సకలలోకాల ప్రభువు, అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు, తీర్పు దినపు యజమాని.★ మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్థిస్తున్నాము. మాకు ఋజు మార్గం చూపించు – ఎవరిపై నీవు నీ కానుకలు కురిపించావో, ఎవరయితే నీ ఆగ్రహానికి గురికాలేదో, ఎవరయితే మార్గభ్రష్టులు కాలేదో వారి మార్గం.

దీని తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదైనా చిన్న సూరా గాని, లేక పెద్ద సూరా యొక్క ఏదైనా ఒక భాగం గాని పఠించండి. ఇక్కడ రెండు చిన్న సూరాలు వ్రాస్తున్నాము. వీటినైతే కంఠస్తం చేసుకోండి. తర్వాత మరికొన్ని సూరాలు ఎవరయినా తెలిసిన వారి సహాయంతో కంఠస్తం చేసుకోండి.

**"ఖుల్ హు వల్లాహు అహద్, అల్లాహుస్సమద్, లమ్
యలిద్ వలమ్ యూలద్ వలమ్ య కుల్లహూ కుఫువన్ అహద్".**

ప్రవక్తా! వారితో చెప్పండి. అల్లాహ్ అయితే ఒక్కడే. ఆయన సకల ఆపేక్షలకు అతీతుడు. ఆయన ఎవరికీ తండ్రి కాడు. ఆయన ఎవరికీ సంతానమూ కాదు. ఆయనకు సరిసమానమయిన వారు ఎవరూ లేరు.

**"వల్ అస్ర్, ఇన్నల్ ఇన్‌సాన లఫీ ఖుస్ర్. ఇల్లల్లజీన ఆమనూ వ అమిలుస్సాలిహాతి వ తవాసౌ బిల్ హఖ్ఖి వ తవాసౌ బిస్సబ్ర్"**

---

★ అంటే ప్రళయ దినం. ఆ రోజు ప్రతి వ్యక్తి చేసిన పనుల లెక్కలు చూపబడతాయి. పూర్తిగా న్యాయం చేకూర్చి ప్రతి ఒక్కరికి దానికి బదులు ఇవ్వటం జరుగుతుంది.

కాలం సాక్షిగా, మనిషి నిస్సందేహంగా నష్టంలో ఉన్నాడు (కాని)- ఎవరయితే విశ్వసించారో, సత్కార్యాలు★ ఆచరించారో, సత్యాన్ని ఉద్బోధించారో, ఇంకా, సహనం కొరకు ఉపదేశించారో వారు తప్ప.

ఇప్పుడు అల్లాహు అక్బర్ అంటూ వంగండి. ఇలా వంగటాన్ని 'రుకూ' అంటారు. రుకూలో రెండు చేతుల్ని రెండు మోకాళ్ళపై ఆనించి పట్టుకోండి. కాళ్ళు నిటారుగా నిలబెట్టి నడుం భూమికి సమాంతరంగా ఉండేటట్లు వంగండి. దృష్టి పాదాల మీద ఉంచండి. ఇప్పుడు ఈ క్రింది సూక్తి కనీసం మూడుసార్లు పఠించండి.

**సుబ్హాన రబ్బియల్ అజీమ్.**

పరమ పవిత్రుడు, మహోజ్వలుడయిన నా ప్రభువు.

తర్వాతః-

**సమి అల్లాహు లిమన్ హమిదహ్.**

స్తుతించిన వాని స్తుతిని అల్లాహ్ విన్నాడు

అని అంటూ నిలబడండి. నిలబడి చేతులు కట్టుకోకుండానే....

**రబ్బనా లకల్ హమ్ద్.**

ఓ నా ప్రభూ! స్తోత్రములన్నీ నీకే

అని పలకండి.

ఇప్పుడు 'అల్లాహు అక్బర్' అంటూ సజ్దా చెయ్యండి. సజ్దా చేయడంలో మొదట మోకాళ్ళు నేలమీద మోపి తర్వాత రెండు చేతుల్ని, ఆ తరువాత ముక్కు, నుదిటిని నేలపై మోపాలి. సజ్దాలో శరీర వెనుక భాగం పైకెత్తి తొడలు కడుపుకు తగలకుండా ఉంచాలి. మోచేతులు క్రింద ఆనకుండా ఉంచాలి. చేతి వ్రేళ్ళు కలిపివుంచి, ఖిబ్లావైపుకు మళ్ళించి ఉంచాలి. రెండు

★ దైవాదేశాల కనుగుణంగా దైవ ప్రసన్నత కోరి చేసే పనులే సత్కార్యాలు.

చేతులను చెవుల క్రింద వచ్చేలా పెట్టాలి. కాలివ్రేళ్ళు ఖిబ్లా వైపునకు మళ్ళించి, నేలకు ఆనించి ఉంచాలి. సజ్దాలో కనీసం మూడు సార్లు - సుబ్‌హాన రబ్బియల్ ఆలా (పరమ పవిత్రుడు, మహోన్నతుడయిన నా ప్రభువు) అని స్మరించాలి.

ఇక 'అల్లాహు అక్బర్' అంటూ సజ్దా నుండి లేచి కూర్చోండి. ఈ కూర్చోవడంలో ఎడమకాలు కుడి వైపుకు మడచి దాని మీద కూర్చొని కుడి కాలును సజ్దా స్థితిలో మాదిరిగానే వ్రేళ్ళు ఖిబ్లా వైపుకు మళ్ళించి పెట్టాలి. రెండు చేతులను రెండు తొడలపై మోకాళ్ళకు చేరువుగా పెట్టుకోవాలి. చేతివ్రేళ్ళు చాచి కొనలు ఖిబ్లా వైపుకు మళ్లించివుంచండి, సరిగా కూర్చున్న తర్వాత మళ్లీ 'అల్లాహు అక్బర్' అంటూ సజ్దాలోకి పోండి. మొదటి సజ్దాలో స్మరించినవే ఇప్పుడు కూడా స్మరించండి. ఆ తర్వాత "అల్లాహు అక్బర్' అంటూ సజ్దా నుండి పైకి లేచి నిటారుగా నిలబడాలి. నిలబడి చేతులు యధాలాపంగా కట్టుకోవాలి. ఇప్పుడు మొదట "బిస్మిల్లాహిర్రహ్మా నిర్రహీమ్" తర్వాత మొదటి రకాతుల్లో పఠించిన విధంగా ఫాతిహా సూరా, తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదైనా ఇతర సూరా పఠించండి. తర్వాత ఇది వరకటి లాగానే రుకూ చేయండి. రుకూ నుంచి నిటారుగా నిలబడండి. తర్వాత సజ్దా చేయండి. మొదటి రకాతులో మాదిరిగానే ఇప్పుడు కూడా రెండు సజ్దాలు చేయండి. కాని ఇప్పుడు రెండు సజ్దాలు అయినాక నిలబడ టానికి బదులుగా రెండు సజ్దాల మధ్య ఎలా కూర్చున్నారో అలా కూర్చోండి. దీన్నే 'ఖాయిదా' అంటారు. ఖాయిదాలో కూర్చొని "తషహ్హుద్" పఠించాలి.

**"అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వ రహ్మతుల్లాహి వ బరకాతుహ్. అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహి స్సాలిహీన్, అష్హదు**

**అన్ ల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్"**

వాక్సంబంధమైన, శరీర సంబంధమైన, ధనసంబంధమైన సమస్త ఆరాధనలు అల్లాహ్ కొరకే, ఓ ప్రవక్తా మీపై శాంతినెలకొనుగాక, దైవకారుణ్యం, శుభములు కలుగుగాక.

మా మీద సజ్జనులయిన దైవ దాసుల మీద (కూడా) శాంతి కలుగుగాక, అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ (సఅసం) ఆయన దాసులని, ఆయన ప్రవక్త అని (కూడా) నేను సాక్ష్యమిస్తున్నాను.

తర్వాత కూర్చొని ఉండే ఈ క్రింది దరూద్ పఠించండిః

**"అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్ వ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లయిత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదు మ్మజీద్ అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్తా అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదు మ్మజీద్"**

"అల్లాహ్! నీవు (హజ్రత్) ఇబ్రాహీం (అస), ఆయన సహచరులపై ఎలా కారుణ్యం కురిపించావో అలాగే (హజ్రత్) ముహమ్మద్ (సఅసం), ఆయన సహచరులపై కారుణ్యం కురిపించు. నిస్సందేహంగా నీవే స్తుతింపదగిన వాడవు మరియు గొప్ప మహత్తు కలవాడవు. అల్లాహ్! నీవు (హజ్రత్) ఇబ్రాహీం (అస)కు, ఆయన అనుచరులకు ఎలా శుభాలు ప్రసాదించావో అలా (హజ్రత్) ముహమ్మద్ (సఅసం)కు, ఆయన అనుచరులకూ్కడ శుభాలను ప్రసాదించు. నిస్సందేహంగా నీవే స్తుతింపదగిన వాడవు మరియు గొప్ప మహత్తు గలవాడవు."

ఆ తర్వాత ఒక దువా పఠించండి. క్రింద ఒక దువా ఉదాహరిస్తున్నాము:
**"రబ్బనా ఆతినా ఫిద్దున్యా హసనతన్ వ ఫిల్ ఆఖిరతి హసనతన్ వ ఖినా అజాబన్నార్"**

"ప్రభూ! మాకు ఇహలోకంలో కూడా మంచిని ప్రసాదించు, పరలోకంలో కూడా మంచిని ప్రసాదించు. మరియు మమ్మల్ని నరకాగ్ని నుంచి రక్షించు."

ఆ తర్వాత ముందు కుడివైపుకు పిదప ఎడమ వైపుకు తిరిగి **"అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్"** (మీపై శాంతి, దైవానుగ్రహాలు కలుగుగాక!) అని పలుకుతూ నమాజ్‌ని పూర్తిచేయాలి.

ఈ విధంగా రెండు రకాతులు పూర్తి అయ్యాయి. ఒక్కోసారి ఏకంగా మూడు లేక నాలుగు రకాతులు కూడా చెయ్యవలసి వస్తుంది. అప్పుడు రెండవ రకాతు తర్వాత ఖాయిదాలో తషహ్హుద్ తర్వాత దరూద్ చదవకుండానే అల్లాహు అక్బర్ అంటూ పైకిలేచి నిలబడాలి. పిదప చేతులు కట్టుకొని మొదటి రెండు రకాతుల్లో పఠించినట్లే బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం చెప్పి ఫాతిహా సూరా దాంతోపాటు ఖుర్ఆన్‌లోని మరో సూరా పఠించాలి.

ఆరాధనలను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవటానికి ముందు కొన్ని పారిభాషిక పదాల అర్థాలు తెలుసుకుని వాటిని జ్ఞాపకం ఉంచుకోవటం చాలా ముఖ్యం. ఈ క్రింది పారిభాషిక పదాలు గమనించండి.

**ఫర్జ్:—**

ఖుర్ఆన్ లేక హదీస్ ద్వారా తప్పని సరిగా చేయాలని నిర్ధారించబడిన దాన్ని 'ఫర్జ్' అంటారు. ఎవరయినా ఏదయినా ఫర్జ్‌ను నిరాకరిస్తే అతను ఇస్లాం పరిధికి దూరమయిపోతాడు. ఫర్జ్‌ను వదలిపెట్టినవాడు ఘోరపాపం చేసిన వాడవుతాడు. తీర్పుదినాన అతనికి దేవుడు ఘోరశిక్ష విధిస్తాడు. ఫర్జ్

ఎలాంటి పరిస్థితుల్లోనయితే వదలటానికి అనుమతించబడిందో అలాంటి పరిస్థితుల్లోనే దాన్ని వదలటానికి వీలుంటుంది. ఉదాహరణకు అపస్మారక స్థితిలో నమాజ్; ప్రయాణం(48 మైళ్ళకు మించిన దూర ప్రయాణం)లో, వ్యాధిలో రోజా (ఉపవాసం) వదలడానికి అనుమతి ఉంది.

**సున్నత్:–**

దైవ ప్రవక్త(సఅసం) ఆచరించిన దాన్ని లేక ఆయన ఆచరించమని ఆదేశించిన దాన్ని 'సున్నత్' అంటారు. ఇది రెండు విధాలు.

**సున్నతె ముఅక్కిదః–**

అంటే దైవ ప్రవక్త (సఅసం) నిత్యమూ చేసిన పని లేక చేయమని నిర్బంధ్యంగా ఆదేశించిన పని. క్లిష్టపరిస్థితుల్లో తప్ప ఇలాంటి పనిని సాధారణంగా వదలటం మంచిదికాదు.

**సున్నతె గైర్ ముఅక్కిదః–**

అంటే దైవప్రవక్త (సఅసం) అప్పుడప్పుడు వదలివేసిన పనులు. ఇలాంటి వాటిని ఎప్పుడయినా వదలిపెట్టటంలో ఎలాంటి తప్పులేదు.

**నఫిల్:–**

కొన్ని పనులు ఆచరించటం అంత ముఖ్యం కానప్పటికి షరీయత్ (ధర్మ శాస్త్రం) వాటిని ఆచరించటం మంచిదని తెల్పుతోంది. ఇలాంటి పనులు ఆచరిస్తే పుణ్యం లభిస్తుంది. కాని వాటిని విడనాడటం వల్ల శిక్ష మాత్రం పడదు.

## నమాజ్ వేళలు

రోజుకు ఐదు సార్లు నమాజ్ చేయటం విధి - ఫర్జ్. ఆ వేళలు 1) ఫజ్ర్ 2) జుహర్ 3) అస్ర్ 4) మగ్రిబ్ 5) ఇషా.

ఫజ్ర్ సమయం ఉషోదయాన మొదలయి అరుణోదయం వరకు వుంటుంది.

జుహర్ వేళ సూర్యుడు పడమటి దిశన వాలినప్పటి నుంచి ఒక వస్తువు నీడ ఆ వస్తువు పొడవుకు రెట్టింపు అయ్యే వరకు ఉంటుంది. దాన్ని గుర్తించటం ఎలాగో ముందు తెలుపడం జరిగింది.

అస్ర్ వేళ జుహర్ వేళ అంతం కాగానే ప్రారంభమయి సూర్యాస్తమయానికి పూర్వం వరకు ఉంటుంది.

మగ్రిబ్ వేళ సూర్యాస్తమయం తర్వాత మొదలై ఆకాశంలో అరుణ రేఖలు ఉన్నంతవరకూ ఉంటుంది.

ఇషా వేళ ఆకాశంలో అరుణరేఖలు అస్తమించినప్పటి నుంచి ప్రారంభమయి ఫజ్ర్ వేళ ప్రారంభమయ్యే వరకు ఉంటుంది.

## నీడను గుర్తించే పద్ధతి

చదును ప్రదేశంలో ఓ కర్ర పాతండి. ఉదయాన సూర్యుడు పైకివచ్చే కొలది కర్ర నీడ పొడుగు తగ్గుతూ పోతుంది, తర్వాత ఆ నీడ తూర్పుకు వాలి మళ్ళీ పెరగటం మొదలెట్టగానే సూర్యుడు వాలుతున్నాడని తెలుస్తుంది. అప్పుడు దాని నీడ కొలవండి, అది ఆ కర్రకు సమంగా ఉంటే దీన్ని అసలు నీడ అంటారు. అప్పుడు జుహర్ వేళ ఆరంభమవుతుంది. ఆ తరువాత దాని నీడ కర్ర నిడివి కంటే రెట్టింపు అయ్యేవరకు జుహర్వేళ ఉంటుంది. దాని తర్వాత వెంటనే అస్ర్ వేళ ప్రారంభమవుతుంది.

## నమాజ్ రకాతులు

ఏ వేళ నమాజ్‌లో ఎన్నెన్ని రకాతులు చెయ్యడం అవసరమో క్రింద సూచించడం జరిగింది:

**ఫజ్ర్:** మొదట రెండు సున్నత్‌లు, తర్వాత రెండు ఫర్జ్‌లు (సున్నత్, ఫర్జ్‌లను గురించి గతంలో తెలుసుకున్నారు).

**జుహర్‌:** మొదట ఒకే చివరి సలామ్‌తో నాలుగు సున్నత్‌లు, తర్వాత ఒకేసారి నాలుగు ఫర్జ్‌లు మళ్ళీ రెండు సున్నత్‌లు.

**అస్ర్‌:** ఒకేసారి నాలుగు ఫర్జ్‌లు.

**మగ్రిబ్‌:** మొదట మూడు ఫర్జ్‌లు, తర్వాత రెండు సున్నత్‌లు.

**ఇషా:** మొదట నాలుగు ఫర్జ్‌లు, తర్వాత రెండు సున్నత్‌లు, మళ్ళీ మూడు విత్ర్‌లు, విత్ర్‌ గురించి తర్వాత వస్తుంది.

ఇవి కాకుండా మరికొన్ని రకాతులున్నాయి. వాటిని చెయ్యటం కూడా పుణ్యమే. కాని ఎలాంటి కష్టం లేకపోయినప్పటికీ వాటిని వదలినందువల్ల నమాజ్‌లో ఎలాంటి కొరతరాదు. వాటిని వదలడం తప్పు కూడా కాదు. అవి ఏమనగా:-

(1) జుహర్‌లో అన్నిటి కంటే చివర రెండు నఫిల్‌
(2) అస్ర్‌లో ఫర్జ్‌ కంటే మొదట నాలుగు సున్నత్‌లు
(3) మగ్రిబ్‌లో అన్నిటికంటే చివర రెండు నఫిల్‌.
(4) ఇషాలో మొదటి నాలుగు సున్నత్‌లు, అన్నిటి కంటే చివర రెండు నఫిల్‌.

ఫజ్ర్‌ నమాజ్‌ తర్వాత సూర్యోదయం అయిందాకా, అస్ర్‌ తర్వాత మగ్రిబ్‌ వరకు ఎలాంటి నమాజ్‌ చేయకూడదు. ఫర్జ్‌, సున్నత్‌, నఫిల్‌ గురించి ముందే తెలుసుకున్నారు. అయితే వాటిని గురించి మరికొన్ని విషయాలు తెలుసుకోవలసి ఉంది. వాటిని ఇక్కడ తెలుసుకోండి.

ఫర్జ్‌:- ఫర్జ్‌ నమాజ్‌ ఎలాంటి పరిస్థితిలో కూడా వదలి పెట్టకూడదు. వ్యాధి అయినా, ప్రయాణం అయినా ఎలాంటి స్థితి అయినా సరే చెయ్యడం అవసరం. అపస్మారకస్థితిలో లేక మతిభ్రమణ స్థితిలో తప్ప మనిషి తెలివితో, బుద్ధి కలిగి ఉన్నంతవరకు తప్పకుండా ఫర్జ్‌ నమాజ్‌ చెయ్యాలి. ఫర్జ్‌ నమాజ్‌

ఎల్లప్పుడూ జమాఅత్‌తో– సామూహికంగా చేయాలి. అనివార్య పరిస్థితి వస్తే అది వేరే విషయం. ఎలాంటి అనివార్య పరిస్థితి లేకుండానే సామూహిక నమాజ్ వదలడం ఘోరమైన తప్పు. మూడు రకాతుల నమాజ్ లో మూడవ రకాత్‌లోను మరియు నాలుగు రకాతుల నమాజ్‌లో చివరి రెండు రకాతుల్లోను ఫాతిహా సూరా తర్వాత మరే సూరా పఠించనవసరం లేదు.

**సున్నత్:**–వ్యాధితో బాధ ఎక్కువగా ఉన్నప్పుడు లేక ప్రయాణంలో ప్రశాంతత లేనప్పుడు సున్నత్ వదలిపెట్టవచ్చు. ఈ నమాజ్ ఎప్పుడూ ఒంటరిగానే చేసుకోవాలి. ఇందులో ప్రతి రకాత్‌లోను ఫాతిహా సూరా తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదో ఓ భాగం తప్పకుండా పఠించాలి. అలాగే నఫిల్ నమాజ్ కూడా ఒంటరిగానే చేసుకోవాలి. అందులో కూడా ప్రతి రకాత్‌లో ఫాతిహా సూరా తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదో ఓ భాగం పఠించాలి.

## విత్ర్ నమాజ్

విత్ర్ నమాజ్ వేళ ఇషా తర్వాత ప్రారంభమై ఉషోదయానికి ముందువరకూ ఉంటుంది. విత్ర్ నమాజ్‌లో మూడు రకాతులుంటాయి. రెండు రకాతుల తర్వాత ఖాయిదాలో కూర్చొని అత్తహియ్యాత్ చదివి మామూలుగా నిలబడాలి. అప్పుడు మూడవ రకాతులో ఫాతిహా సూరా తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదో ఓ భాగం పఠించండి, తర్వాత 'అల్లాహు అక్బర్' అంటూ చేతుల్ని చెవుల దాకా ఎత్తి దించి యధాప్రకారం చేతులు కట్టుకోండి. అలా నిలబడే ఖునూత్ అనే ఈ దుఆ పఠించండి.

"అల్లాహుమ్మ ఇన్నా నస్‌తఈనుక వనస్‌తగ్ ఫిరుక వనుమిను బిక వనతవక్కలు అలైక వనుస్నీ అలైకల్ ఖైర వనష్ కురుక వ లానక్ఫురుక వనఖ్‌లఊ వ నత్‌రుకు మఁయ్యఫ్ జురుక అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదు వలకనుసల్లీ వ నస్‌జుదు వ ఇలైకనస్‌అ

**వనహ్‌ఫిదూ వ నర్‌జూ రహ్మతిక వ నఖ్‌షా అజాబక ఇన్న అజాబక బిల్ కుఫ్ఫారి ముల్‌హిఖ్"**

"అల్లాహ్! మేము నీ సహాయాన్ని కోరుతున్నాము. నిన్ను క్షమాపణ అర్థిస్తున్నాము, నిన్నే విశ్వసిస్తున్నాము. నీపై భరోసా చేస్తున్నాము. నిన్ను ఉత్తమరీతిలో కీర్తిస్తున్నాము, నీకు కృతజ్ఞత చూపుతున్నాము. నీ కృతఘ్నతకు లోనుకాము. నీ ఆజ్ఞల్ని అతిక్రమించే వారికి దూరంగా ఉంటాము, వారిని వదలి వేస్తాము.

దేవా! మేము నిన్నే ఆరాధిస్తున్నాము. నీ కోసమే నమాజ్ చేస్తున్నాము. సజ్దా చేస్తున్నాము. మా సకల కార్యకలాపాలన్నీ నీ కోసమే, మేము నీ సేవే చేస్తున్నాము. నీ అనుగ్రహాన్ని ఆశిస్తున్నాము. నీ శిక్షకు భయపడుతున్నాము. నిస్సందేహంగా నీ శిక్ష తిరస్కారులకు లభించడం తథ్యం.

## అజాన్ మరియు ఇకామత్

అజాన్ అంటే పిలుపు నివ్వటం అని అర్థం, నమాజ్‌కు ముందు నమాజ్ కోసం పిలవడానికి ఒకరు నిలబడి బిగ్గరగా పిలుస్తారు. దాన్నే అజాన్ అంటారు. మొట్టమొదట నాల్గు సార్లు బిగ్గరగాః

**"అల్లాహు అక్బర్"**

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు అనాలి. తరువాత రెండేసి పర్యాయాలు దిగువనిచ్చిన మాటల్ని ఆ క్రమంలోనే బిగ్గరగా అనాలి.

**"అష్‌హదు అల్లాయిలాహ ఇల్లల్లాహ్"**

అల్లాహ్ తప్ప ఆరాధింపదగినవాడెవడూ లేడని నేను సాక్ష్యమిస్తున్నాను.

**"అష్‌హదు అన్న ముహమ్మదర్ రసూలుల్లాహ్"**

ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ సందేశహరుడు అని నేను సాక్ష్యమిస్తున్నాను.

**"హయ్య అలస్సలాహ్"**

నమాజ్ వైపునకు రండి,

**"హయ్యఅలల్ ఫలాహ్"**

సాఫల్యం వైపునకు రండి,

**"అల్లాహు అక్బర్"**

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, ఆ తర్వాత ఒకసారి **"లాయిలాహ ఇల్లల్లాహ్"** (అల్లాహ్ తప్ప ఆరాధింపదగిన వాడెవడూ లేడు) అని చెప్పి ముగించాలి.

ఫజర్ అజాన్‌లో **"హయ్యఅలల్‌ఫలాహ్"** తర్వాత రెండు సార్లు **"అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్"** (నిద్ర కంటే నమాజ్ మేలైనది) అని పలకాలి.

ప్రతి ఫర్జ్ నమాజ్‌కు ముందు నమాజ్ వేళ కాగానే తప్పనిసరిగా అజాన్ చెప్పాలి, నమాజ్ చేసేవాళ్ళు ఒకడున్నా పలువురున్నా; నమాజ్ మస్జిద్‌లో చేసినా మరెక్కడ చేసినా సరే అజాన్ చెప్పటం చాలా అవసరం. ప్రయాణంలో ఉన్నా కూడా అజాన్ చెప్పాలి.

అజాన్ చెప్పేటప్పుడు ముఖం ఖిబ్లా వైపుకు ఉండాలి. రెండు చూపుడు వ్రేళ్ళను చెవుల్లో ఉంచాలి. సాధ్యమైనంత వరకు ఏదైనా ఎత్తయిన ప్రదేశంపై నిలబడి అజాన్ బిగ్గరగా చెప్పాలి, **'హయ్యఅలస్సలాహ్'** అని చెప్పేటప్పుడు కుడి వైపునకు **'హయ్యఅలల్‌ఫలాహ్'** అని చెప్పేటప్పుడు ఎడమ వైపునకు ముఖంతిప్పాలి. వుజూ లేకుండా కూడా అజాన్ చెప్పవచ్చు. వుజూ చేసి అజాన్ చెప్పడం మంచిది.

ఫర్జ్ నమాజ్ ప్రారంభించటానికి ముందు అజాన్‌లో చెప్పిన మాటలే తిరిగి చెప్పాలి, అందులో హయ్యఅలల్ ఫలాహ్ తర్వాత రెండు సార్లు

**'కద్‌కామతిస్సలాహ్'** (ఇక నమాజ్ కోసం జమాఅత్ నిలబడుతోంది) అనే మాటలు అదనంగా పలకాలి, దీన్ని ఇకామత్ అంటారు. ఇకామత్‌లో హయ్యి అలస్సలాహ్, హయ్యి అలల్‌ఫలాహ్ అంటూ ముఖం కుడి, ఎడమల వైపునకు తిప్పనవసరంలేదు.

## నమాజ్‌లో పొరపాటు

నమాజ్ చేయటానికి కొన్ని గమనించవలసిన విషయాలున్నాయి. వాటిని విస్మరిస్తే అసలు నమాజే కాదు. మళ్ళీ నమాజ్ చేయవలసి వస్తుంది. కొన్ని విషయాల పట్ల పొరపాటు జరిగినా నమాజ్ పూర్తవుతుంది. అంచేత వాటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి.

ఏ విషయాలైతే లోపించినందువల్ల నమాజ్ పూర్తికాదో వాటిని ఇక్కడ పేర్కొంటున్నాము. వీటిలో ఏ ఒక్కటి లోపించినా నమాజ్ మళ్ళీ చేయవలసివస్తుంది.

(1) ఏ నమాజ్ చేయవలసి ఉందో ఆ నమాజ్ వేళ కావాలి. వేళకాని వేళ నమాజ్ చేస్తే నమాజ్ కాదు.

(2) నమాజ్ చేసే వ్యక్తి దేహం, బట్టలు, నమాజ్ చేసే ప్రదేశం పరిశుద్ధంగా ఉండాలి, పరిశుద్ధతను గురించి మీరిదివరలో తెలుసుకున్నారు.

(3) నమాజ్ చేయబోయే వ్యక్తి స్నానం చేయవలసిన అవసరం ఉంటే స్నానం చేసి ఉండాలి; వుజూ చేయవలసి ఉంటే వుజూ చేసి ఉండాలి. అనివార్య పరిస్థితులయితే తయమ్ముం చేసుకోవాలి, తయమ్ముం గురించి కూడా మీరు తెలుసుకున్నారు.

(4) పురుషులకు కనీసం నాభి నుండి మోకాళ్ళక్రింది వరకు దేహంలోని ఏ భాగమూ కనబడకుండా కప్పబడి ఉండాలి. స్త్రీలకు ముఖం, ముంజేతులు, పాదాలు తప్ప తక్కిన శరీరమంతా ఏ మాత్రం కనబడకుండా కప్పబడి ఉండాలి.

(5) నమాజ్ ప్రారంభించటానికి ముందు సంకల్పం, (నియ్యత్) చేసుకోవాలి. అంటే మీరు ఏ నమాజ్ చేయబోతున్నారు?; అది ఫర్జా? సున్నతా? లేక నఫిలా? ఎన్ని రకాతులు చెయ్యబోతున్నారు? అనే విషయాలు దృష్టిలో ఉంచుకుని అలాగే సంకల్పం చేసుకోవాలి. సంకల్పం (నియ్యత్) లేకపోతే నమాజ్ కాదు. సంకల్పం చేసే మాటలు నోటితో ఉచ్చరించినా మంచిదే. లేకపోయినా ఫరవాలేదు. మనసులో అనుకుంటే చాలు.

(6) సంకల్పం అనంతరం 'అల్లాహు అక్బర్' అని చెప్పి చేతులు కట్టుకోవాలి.

(7) నిటారుగా నిలబడాలి.

(ఇమామ్ రుకూలో గాని, సజ్దాలోగాని, కాయిదాలో గాని ఉన్నప్పుడు మీరు వచ్చారనుకోండి, అప్పుడు మీరు మొదట నిటారుగా నిలబడి 'అల్లాహు అక్బర్' అని చెప్పటం చాలా ముఖ్యం. తర్వాత మళ్ళీ 'అల్లాహ అక్బర్' అంటూ ఇమామ్‌తో పాటు కలవాలి).

(8) ఫాతిహా సూరా పఠించాలి.

(9) ప్రతి రకాత్‌లో ఒక రుకూ, రెండు సజ్దాలు చేయాలి.

(10) చివరి రకాత్ అంతంలో, 'అత్తహియ్యాత్' పఠించేందుకు అవసరమయినంత సమయం కూర్చోవాలి.

నమాజ్‌లో మరికొన్ని విషయాలున్నాయి. వాటిని మరచిపోయి వదలినప్పుడు ఆఖరిలో 'సహూ సజ్దా' చేస్తే నమాజ్ పరిపూర్ణమవుతుంది. ఆ విషయాలు ఏమనగా:-

(1) సున్నత్, నఫిల్, విత్ర్ రకాతులన్నింటిలో; ఫర్జ్ రకాతుల్లోని మొదటి రెండు రకాతుల్లో ఫాతిహా సూరా తర్వాత ఏదైనా రెండవ సూరా లేక అవసరమయినంత ఖుర్ఆన్ భాగం పఠించాలి.★

---

★ ఖుర్ఆన్ భాగంలోని కనీసపు ఎంత భాగం పఠించాలన్నది గతంలో తెలియజెయ్యబడింది.

(2) రుకూ, సజ్దాలలో కనీసం ఒకసారి 'తస్బీహ్'★ (స్మరణ) చేసేటంతటి సమయం ఉండాలి.

(3) రుకూ నుంచి సజ్దా స్థితికి పోయే ముందు నిటారుగా నిలబడాలి.

(4) రెండు సజ్దాల మధ్య సరిగ్గా కూర్చోవాలి.

(5) రెండు కంటే ఎక్కువ రకాతులు గల నమాజ్‌లోని మొదటి రెండు రకాతుల తర్వాత అత్తహియ్యాత్ పఠించటానికి కూర్చోవాలి. మరియు అత్తహియ్యాత్ పఠించాలి.

(6) ఆఖరి కాయిదాలో 'అత్తహియ్యాత్' పఠించాలి.

(7) ఇమామ్ జుహర్, అస్ర్ నమాజుల్లోని నాలుగు రకాతుల్లో దివ్య ఖుర్‌ఆన్ నిశ్శబ్దంగా పఠించాలి. ఫజ్ర్, మగ్రిబ్, ఇషా నమాజుల్లోని మొదటి రెండు రకాతుల్లో బిగ్గరగా, మిగతా రకాతుల్లో నిశ్శబ్దంగా పఠించాలి.

(8) విత్ర్ నమాజ్ లోని మూడవ రకాత్‌లో రుకూకు ముందు 'దువాయె కునూత్' పఠించాలి.

ఈ పై విషయాలు మరచిపోయి వదిలేస్తే "సహూ సజ్దా" చేస్తేచాలు. నమాజ్ మళ్ళీ చేయవలసిన అవసరంలేదు. సజ్దా సహూ చేయకపోతే మళ్ళీ నమాజ్ చేయవలసి ఉంటుంది. సజ్దా సహూ చేసే పద్ధతి ముందు వస్తుంది.

ఈ క్రింద కొన్ని విషయాలు ఇస్తున్నాం. వాటిలో ఏదైనా పొరపాటున వదిలేసినా నమాజ్ అవుతుంది (ఎలాంటి లోపం రాదు). వాటిని వదలి పెట్టినందువల్ల సహూ సజ్దా కూడా చేయనవసరం లేదు. అయితే తెలిసి బుద్ధి పూర్వకంగా వదలటం తప్పు.

---

★ సుబ్‌హాన రబ్బిఅల్ అజీమ్, సుబ్‌హాన రబ్బిఅల్ ఆలా పఠించటాన్ని తస్బీహ్ అంటారు.

(1) సంకల్పం చేసిన తర్వాత అల్లాహు అక్బర్ అంటూ రెండుచేతుల్ని పురుషులు చెవుల వరకు, స్త్రీలు భుజాల వరకు ఎత్తడం.

(2) రెండు చేతుల వ్రేళ్ళను ఖిబ్లావైపుకు త్రిప్పి చాచి ఉంచటం.

(3) మొదటి రకాత్‌లో సనా, 'అవూజు బిల్లాహి మినష్షైతా నిర్రజీమ్' చదవడం.

(4) ప్రతి రకాతులో ఫాతిహా సూరాకు ముందు బిస్మిల్లా హిర్రహ్మానిర్రహీమ్ చదవటం.

(5) రుకూ, సజ్దా స్థితుల్లోకి పోతున్నప్పుడు, సజ్దానుండి తల ఎత్తినప్పుడు ప్రతీసారి అల్లాహు అక్బర్ అనటం.

(6) రుకూ, సజ్దాలలో కనీసం మూడేసి సార్లు తస్బీహ్ స్మరించటం.

(7) రుకూ నుంచి తల ఎత్తేటప్పుడు "సమి అల్లాహు లిమన్ హమిదా" అని నిలబడి "రబ్బనా లకల్ హమ్‌ద్" అని పలకడం, ఇమామ్ వెనుక ఉండేవారు "రబ్బనా లకల్ హమ్‌ద్" అని మాత్రమే చెప్పాలి.

(8) "అత్తహియ్యాత్" పఠిస్తూ "అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్" అనేటప్పుడు చూపుడు వ్రేలితో సంజ్ఞ చేయటం.

(9) చివరి ఖాయిదాలో దరూద్ మరియు దువా పఠించటం.

(10) నమాజ్ అంతంలో ముందు కుడివైపు ఆ తర్వాత ఎడమవైపు ముఖం త్రిప్పి "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్" అని పలకడం.

## సహూ సజ్దా చేసే విధానం

నమాజ్ అంతంలో 'అత్తహియ్యాత్' పఠించిన తర్వాత కుడివైపుకు ముఖం త్రిప్పి "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహ్" అని చెప్పాలి, తర్వాత 'అలాహు అక్బర్' అంటూ సజ్దా చేయాలి. తరువాత మరో సజ్దా

చేయాలి. అప్పుడు తిరిగి 'అత్తహియ్యాత్' ఆ తర్వాత దరూద్ మరియు దువా పఠించి మామూలుగా సలాము ద్వారా నమాజ్ ముగించాలి.

## నమాజ్‌ను భంగపరిచే విషయాలు

ఏ విషయాల వల్ల నమాజ్ భంగమవుతుందో వాటిని క్రింద ఇస్తున్నాం, అలాంటిది ఏదైనా జరిగితే నమాజ్ మళ్ళీ చేయవలసి ఉంటుంది:

1) నమాజ్‌లో మాట్లాడటం- తెలిసి అయినా, పొరపాటున అయినా, ఇంకా కొద్దిగా మాట్లాడినా లేక ఎక్కువగా మాట్లాడినా సరే.
2) నమాజ్‌లో ఉండి ఎవరికయినా సలామ్ చేయడం లేక సలామ్‌కు ప్రతి సలాం చేయటం.
3) ఏదైనా బాధ వల్ల అబ్బా, అయ్యో అనటం.
4) చూచి ఖుర్‌ఆన్ పఠించటం,
5) చూసేవారు "ఇతను నమాజ్ చెయ్యటం లేదు" అనుకునేలా ఏదయినా పని చేయడం.
6) ఏదయినా తినడం లేక త్రాగడం.
7) ఖుర్‌ఆన్ పఠనంలో, ఖుర్‌ఆన్ భావాన్నే తారుమారు చేసే అర్థం వచ్చేలా పొరపాటు చెయ్యడం.
8) రెండు నమాజ్ వరుసలకు కావలసినంత దూరం నమాజ్‌లో నడవటం.
9) ఖిబ్లా వైపు నుంచి ముఖం త్రిప్పటం.
10) అపరిశుద్ధమయిన ప్రదేశంలో నమాజ్ చేయటం.
11) కిలకిలా నవ్వటం.
12) ఇమామ్‌ను దాటి నిలబడటం.

నమాజ్ చేసేటప్పుడు మనం వేసుకున్న బట్టలు కూడా సక్రమంగా ఉండాలి, అలసత్వంతో వస్త్రం నెత్తి మీద వేసుకోవడం, చొక్కా లేక కోటు సరిగ్గా తొడగకుండా అలాగే చేతులకు తగిలించుకోవటం, భుజం మీద

టువ్వాలో, దుప్పటో వేసుకోవటం సరయిన పద్ధతి కాదు. ఏ బట్టలి నయితే తొడిగి ప్రజల్లో తిరగడాన్ని ఇష్టపడమో అలాంటివి తొడిగి నమాజ్ లోకి వెళ్ళరాదు. బద్ధకంతో, నిర్లక్ష్యం వల్ల టోపి లేకుండా నమాజ్ చేయటం కూడా మంచిది కాదు.

## ఎట్టి పరిస్థితుల్లో నమాజ్‌ని భంగపరచుకోవచ్చు?

నమాజ్ చేయటం మొదలెట్టిన తర్వాత దాన్ని భంగపరచడం సరయిన విధానం కాదు. ఒకవేళ అనివార్య పరిస్థితి ఏదైనా ఏర్పడితే అది వేరే విషయం. ఏ పరిస్థితుల్లో నమాజ్‌ని భంగపరచవచ్చో వాటిలో కొన్నింటిని క్రింద ఇస్తున్నాం:

1) పాము, తేలు, పులి, తోడేలు, పిచ్చికుక్క మొదలైన బాధించే కీటకాలు, జంతువుల భయం కలిగినప్పుడు,

2) ఏదైనా కొంచెం విలువైన వస్తువు నష్టపోతుందన్న భయం కల్గినపుడు

3) రైలు లేక బస్సు అందనపుడు, ప్రయాణం చెయ్యకపోతే ఏదయిన నష్టం సంభవిస్తుందనుకుంటే లేక బండిలో సామాను, పిల్లా జెల్లా ఉన్నపుడు,

4) నమాజ్‌లో మలమూత్రాల అవసరం తీవ్రమైనప్పుడు,

5) ఎవరయినా ఆపదలో చిక్కుకుంటే వారిని కాపాడే అవసరం వచ్చినప్పుడు. ఉదాహరణకు:- ఎవరైనా మంటలకు గురయితే, లేక నీళ్ళలో మునిగిపోతుంటే లేక మరే ఆపదలోనైనా చిక్కుకున్నప్పుడు, అలాంటి పరిస్థితుల్లో నమాజ్ భంగపరచకపోవడం ఘోరమైన పాపం.

6. తల్లిదండ్రులు, తాతా బామ్మలు తదితర పెద్దలు అవసరం ఉండి పిలిచినపుడు.

## తరావీహ్ నమాజ్

రమజాన్ మాసంలో ఇషా నమాజ్ తర్వాత, విత్ర్ నమాజ్‌కు ముందు ఇరవై రకాతుల నమాజ్ చెయ్యడం జరుగుతుంది, దాన్ని "తరావీహ్ నమాజ్" అనంటారు. ఏదైనా అనివార్యమైతే వీటిని విత్ర్ నమాజ్ తర్వాత కూడా చెయ్యవచ్చు. ఉషోదయానికి పూర్వం వరకూ ఈ నమాజ్ వేళ ఉంటుంది. తరావీహ్ నమాజ్ సామూహికంగా చేయడం మంచిది. రమజాన్ నెలలో కనీసం ఒకసారి ఖుర్‌ఆన్ మొత్తం పఠించటం సున్నత్ (మహాప్రవక్త సంప్రదాయం). ఖుర్‌ఆన్ సొంతం జ్ఞాపకం లేని వారు జ్ఞాపకం ఉన్నంత వరకే 'తరావీహ్'లో పఠించాలి.

## వ్యాధిగ్రస్థుని నమాజ్

రోగావస్థలో కూడా నమాజ్ వదలటానికి అనుమతి లేదని మీరు తెలుసుకున్నారు. ఒకవేళ రోగ కారణంగా బలహీనత ఏర్పడినందువల్ల లేక ఏదైనా బాధ ఉన్నందువల్ల నిలబడలేకపోతే కూర్చొని నమాజ్ చేయవచ్చు. రుకూ, సజ్దాలు చేయలేకపోతే సంజ్ఞల ద్వారా రుకూ సజ్దాలు చేయవచ్చు. కూర్చోటానిక్కూడా శక్తిలేనప్పుడు పడుకొని ఉండీ తల, చేతుల సంజ్ఞల ద్వారా నమాజ్ చేయాలి. పడుకొని ముఖం కాబావైపుకు పెట్టాలి. తలా, చేతులు కూడా ఆడించటానికి శక్తిలేనప్పుడు నమాజ్ చేయనవసరం లేదు. అలాంటి వారికి నమాజ్ మాఫీ చెయ్యబడుతుంది. ఆ స్థితిలో వరుసగా ఐదు నమాజ్‌లు తప్పితే వాటిని తిరిగి చేయనవసరం లేదు. ఐదుకు లోపు నమాజ్‌లు తప్పితే మాత్రం తిరిగివాటిని (ఆరోగ్యవంతుడయినప్పుడు) చేయాలి.

## ప్రయాణీకుని నమాజ్

ఎవరయినా తన ఇంటి నుంచి కనీసం నలభై ఎనిమిది మైళ్ళకు తక్కువ కాని దూర ప్రదేశానికి బయల్దేరితే అతడు, 'ప్రయాణీకుడు' అనబడ

తాడు. ఇంటి నుంచి బయలుదేరగానే అతను ప్రయాణీకుడుగా పరిగణించ బడతాడు. ప్రయాణీకుడు ఫర్జ్ నమాజ్‌లో నాలుగు రకాతులకు బదులు రెండు రకాతులు మాత్రమే చెయ్యాలి. మూడు రకాతుల నమాజ్‌ను తగ్గించ కూడదు. ప్రయాణంలో సున్నత్ నమాజ్ వదలిపెట్టవచ్చు కాని ఎలాంటి తొందర లేకుండా, ప్రశాంతంగా ఉంటే సున్నత్ నమాజ్ కూడా చేయటం మంచిది. ఫజ్ర్ నమాజ్‌లోని సున్నత్ రకాతులు ప్రయాణంలో కూడా వదలి వేయరాదు. ఇది చాలా ముఖ్యం.

సామూహిక నమాజ్ చేయవలసి వచ్చినపుడు పూర్తి నమాజ్ చేయాలి. ఇమామ్ కూడా ప్రయాణీకుడయితే నాలుగు రకాతుల ఫర్జ్ నమాజ్‌లో రెండు రకాతులే చేస్తాడు. అలాంటి ఇమామ్ వెనుక నమాజ్ చేసే వాళ్ళు ప్రయాణీకులైతే ఇమామ్‌తో పాటు సలాం చేసి నమాజ్ ముగించుకుంటారు. ప్రయాణీకులు కాని వారు అలా చేయక వెంటనే లేచి మిగిలిన రెండు రకాతులు పూర్తి చేసుకోవాలి.

'ప్రయాణీకుడు' ఒకవేళ ఎక్కడైనా పదిహేను లేక అంతకంటే ఎక్కువ రోజులుండాలని సంకల్పించుకుంటే ఆ ప్రదేశం చేరిన తర్వాత అతను ప్రయాణీకుడుగా ఉండడు. అంటే అప్పుడతను పూర్తి నమాజ్ చేయాలి. అంతకంటే తక్కువ రోజులు ఉండాలని సంకల్పించుకుంటే మాత్రం ప్రయాణీకుడిగానే పరిగణించబడతాడు.

## జుమా నమాజ్

శుక్రవారం (జుమా) రోజు మామూలుగా జుహర్‌లో చేసే నాలుగు రకాతుల ఫర్జ్ నమాజ్‌కు బదులు రెండు రకాతులే ఫర్జ్ నమాజ్ జమాఅత్‌తో చేయబడుతుంది, దాన్ని 'జుమా నమాజ్' అంటారు. ఆ రెండు రకాతుల ఫర్జ్‌తో పాటు జుహర్‌లో చేసే సున్నత్‌లు కూడా చేయబడతాయి. అయితే ఫర్జ్ తర్వాత మరో నాలుగు రకాతులు సున్నత్ నమాజ్ కూడా చెయ్యడం మంచిది.

జుమా నమాజ్ ముస్లిం పురుషులకు ఫర్జ్‌గా విధించబడింది. జుమా నమాజ్‌కు ముందు ఇమామ్ మస్జిద్‌లో హాజరు అయిన వారికి ధార్మిక విషయాలను గురించి బోధిస్తాడు. దాన్ని 'ఖుత్బా' లేక ప్రసంగం అంటారు. జుమా నమాజ్‌లో ఖుత్బా తప్పనిసరిగా ఉండాలి. ఖుత్బాలేకుండా ఈ నమాజ్ కాదు. ఖుత్బా వినటం కూడా చాలా అవసరమే. ఖుత్బా ప్రారంభించగానే అందరూ నిశ్శబ్దంగా కూర్చోవాలి. ఆ సమయంలో మాట్లాడటం, నమాజ్ చేయటం, తినటం, త్రాగటం, ఖుర్ఆన్ పఠించటం, సలామ్ చేయటం, ప్రతి సలామ్ చేయటం, దైవనామ సంస్మరణలాంటిది చేయటం- అన్నీ నిషిద్ధం. ఖుత్బా ఇవ్వటానికి ఇమామ్ మింబర్ మీద కూర్చున్నప్పుడు అతని ఎదురుగా నిలబడి అజాన్ ఇవ్వాలి. తర్వాత ఇమామ్ నమాజ్‌కై వచ్చిన శ్రోతలనుద్దేశించి ఖుత్బా ఇవ్వాలి. రెండు ఖుత్బాలు ఉంటాయి. రెండింటి మధ్య ఇమామ్ కొంచెం సేపు విరామంగా కూర్చోవాలి.

కొందరికి జుమా నమాజ్ నుండి మినహాయింపు ఉంది. వారెవరంటే- స్త్రీలు, పిల్లలు, ఖైదీలు, ఉన్మత్తులు, వ్యాధిగ్రస్తులు, అంధులు, వికలాంగులు, ప్రయాణీకులు. అయితే వీరిలో ఎవరయినా జుమా నమాజ్ చేస్తే అందులో తప్పులేదు. మళ్ళీ అలాంటి వ్యక్తి జుహర్ నమాజ్ చేయవలసిన అవసరం లేదు. జుమా నమాజ్ చేయలేని వాడు జుహర్ నమాజ్ చేసుకోవాలి. జుమా నమాజ్ సామూహికంగా చేయాలి. ఒంటరిగా చేస్తే నమాజ్ కానేకాదు. ఇమామ్ కాకుండా కనీసం మరో ముగ్గురు అయినా ఉండాలి. అంతకంటే తక్కువ వ్యక్తులుగల జమాఅత్ జుమా నమాజ్ చేసినా అది నెరవేరదు.

జుమా నమాజ్ కోసం అజాన్ కాగానే అమ్మటం, కొనటం సమస్తం హరామ్ ★(నిషిద్ధం) అయిపోతాయి. దీన్ని గురించి చాలా తక్కువ మంది ఆలోచిస్తారు, మీరు మాత్రం గుర్తించుకోండి, జుమా అజాన్ కాగానే మీరేమీ

---

★ నిషేధం అని ప్రామాణికంగా రుజువు చేయబడిన దాన్ని "హరామ్" అంటారు. దాన్ని కాదనేవాడు కాఫిర్ అవుతాడు. దానికి పాల్పడినవాడు ఘోరమయిన పాపం చేసిన వాడవుతాడు, అతనికి ఘోరశిక్ష విధించబడుతుంది.

కొనటం గాని, అమ్మటం గాని చేయకండి, నమాజ్ అయిపోయిన తర్వాత అమ్మవచ్చు, కొనవచ్చు.

## ఈద్ నమాజ్

మనకు రెండు పండుగలున్నాయి. ఒకటి రమజాన్ నెల ఉపవాసాల తర్వాత వచ్చే పండుగ, దాన్ని 'ఈదుల్ ఫిత్ర్' అంటారు. రెండవది ఖుర్బానీ పండుగ, దాన్ని 'ఈదుల్ అజ్హా' అంటారు. ఈద్ నమాజ్‌కు ముందు అజాన్‌గాని, ఇఖామత్ గాని చెప్పకూడదు. ఈద్ నమాజ్‌లో కూడా ఖుత్బా ఉంటుంది. అయితే ఈ ఖుత్బా నమాజ్ తర్వాత ఇవ్వబడుతుంది. ఎవరికయితే జుమా నమాజ్ విధి అవుతుందో వారికే ఈద్ నమాజ్ కూడా విధి అవుతుంది. ఈద్ నమాజ్‌లో కూడా రెండు రకాతులుంటాయి. కాని వీటి ప్రతి రకాత్‌లో మూడేసి తక్బీరులు అదనంగా ఉంటాయి. ఈద్ నమాజ్ చేసే విధానం ఈ క్రింది విధంగా ఉంటుంది.

సంకల్పం చేసుకున్న తర్వాత ఇమామ్ 'అల్లాహు అక్బర్' చెప్పగానే మీరు కూడా 'అల్లాహు అక్బర్' అంటూ చేతులు చెవుల వరకు ఎత్తి ఇతర నమాజుల్లో మాదిరిగానే చేతులు కట్టుకోండి, సనా పఠించి ఇమామ్ చెప్పే తక్బీర్‌లు ఆలకిస్తూ ఉండండి. ఇమామ్ సనా పఠించిన తర్వాత మూడు సార్లు 'అల్లాహు అక్బర్' అంటూ చేతులు చెవుల వరకు ఎత్తుతాడు. మీరు కూడా అలాగే 'అల్లాహు అక్బర్' అంటూ చేతులు చెవుల వరకు ఎత్తండి. కాని అప్పుడు చేతులు కట్టుకోకుండా క్రిందకు వదలివేయండి. మొదటి రెండుసార్లు అలాగే చేయాలి. మూడవసారి మాత్రం 'అల్లాహు అక్బర్' అని చెప్పి చేతులు కట్టుకోండి. ఇప్పుడు మౌనంగా నిలబడి ఇమామ్ పఠించేది వినండి. ఇమామ్ ఫాతిహా సూరా, ఆ తర్వాత ఖుర్‌ఆన్‌లోని ఏదో ఓ భాగం పఠించి రుకూలోకి పోతాడు. తర్వాత రెండు సజ్దాలు చేస్తాడు. మీరు కూడా అలాగే ఇతర నమాజుల్లో అనుసరించినట్లు ఇమామ్‌ను అనుసరించండి.

రెండవ రకాత్‌లో ఇమామ్ నిలబడి ఫాతిహా సూరా ఖుర్‌ఆన్‌లోని మరో సూరా పఠించి మొదటి రకాత్‌లో మాదిరిగానే 'అల్లాహు అక్బర్' అంటూ చేతులు చెవులదాకా ఎత్తుతాడు. అలాగే మీరు కూడా 'అల్లాహు అక్బర్' అంటూ చేతులు ఎత్తండి, మూడుసార్లు ఇలాగే చేయాలి, మూడుసార్లు కూడా చేతులు క్రిందికి వదలివేయాలి. నాల్గవసారి చేతులెత్తకుండా 'అల్లాహు అక్బర్' అంటూ రుకూ చెయ్యండి. మిగతా నమాజ్ ఇతర నమాజుల మాదిరిగానే ముగించాలి.

ఈద్ నమాజ్ వేళ బారెడు పొద్దెక్కిన తర్వాత ఆరంభమై సూర్యుడు వాలటానికి పూర్వం వరకూ ఉంటుంది, ఈద్ నమాజ్‌కు ముందు ఇంట్లో గాని, ఈద్‌గాహ్‌లో గాని మరియు ఈద్ నమాజ్‌కు తర్వాత ఈద్ గాహ్‌లోగాని ఎలాంటి నఫిల్ నమాజ్ చేయకూడదు. ఈద్ నమాజ్ ఈద్‌గాహ్‌లో చేయాలి. వీలైనంతవరకు ఈద్‌గాహ్‌కు కాలి నడకన పోవాలి. ఒక బాటన పోయి మరో బాటన తిరిగిరావటం సున్నత్. దారిలో ఈ క్రింది ప్రార్థన పఠిస్తూ పోవాలి.

**"అల్లాహు అక్బర్–అల్లాహు అక్బర్–లా ఇలాహ ఇల్లల్లాహు– వల్లాహు అక్బర్–అల్లాహు అక్బర్ – వలిల్లాహిల్ హమ్ద్."**

పండగ రోజు స్నానం చేయటం, మిస్వాక్(దంతధావన) చేయటం, దైవమిచ్చిన వస్త్రాల్లో మంచివైనవి ధరించటం, సువాసన ద్రవ్యాలు రాసుకోవటం సున్నత్.

## ఖుర్బాని (పశు త్యాగం)

ఖుర్బాని పండుగ (ఈదుల్ అజ్‌హా) నాడు, ఈద్‌నమాజ్ తర్వాత, జకాత్ విధి అయిన వారంతా ఖుర్బానీ (పశు త్యాగం) కూడా చేయాలి.

మీరు హజ్రత్ ఇబ్రాహీం (అస్సలాం) పేరు వినేవుంటారు. 'ఆయన, మక్కా పట్టణాన్ని నిర్మించి, ఆ పట్టణంలో ప్రజల్ని నివసింపజేసి అక్కడ

ఒకే దేవుని ఆరాధన కొరకు 'కాబా' అనబడే ఆలయం కూడా కట్టించిన దైవ ప్రవక్త. ఒకసారి కలలో ఆయన తన కుమారుడు ఇస్మాయీల్ (అస)ని ఖుర్బానీ చేస్తున్నట్టు చూశారు, దాన్ని ఆయన దైవ ప్రీతి కొరకు తన కొడుకును అర్పించమని దేవుని సూచనగా తెలుసుకున్నారు, ఆ విషయాన్ని హజ్రత్ ఇబ్రాహీం (అస) తన కుమారునికి తెలియజేశారు. హజ్రత్ ఇస్మాయీల్ (అస) వెంటనే అందుకు అంగీకరించి "నాన్నా! మీకు ఇవ్వబడిన ఆదేశాన్ని నెరవేర్చండి, ఇన్షా అల్లాహ్ దైవం కోరితే ప్రాణం అర్పించటంలో నేనే విధంగాను వెనకాడనని మీరు గ్రహిస్తారు" అని అన్నారు.

తండ్రీ కొడుకులు ఇద్దరూ ఇష్టపడ్డారు. కాని సరిగ్గా అదే సమయానికి దేవుడు వాళ్ళను కటాక్షించాడు. కుమారునికి బదులు ఒక గొఱ్ఱెని ఖుర్బాని చేయమని ఆజ్ఞాపించాడు. పండుగ రోజు చేసే ఖుర్బానీ (పశు త్యాగం) ఆ సంఘటన జ్ఞాపకార్థమే ఖుర్బానీ చేసి, ముస్లిములు, తాము కూడా హజ్రత్ ఇబ్రాహీం (అస్సలాం) లాగానే దైవ విధేయులమని, దైవ ప్రీతికోసం తమ ధనాన్ని, ప్రాణాన్ని, సంతానాన్ని -సమస్తమూ త్యాగం చేయటానికి సిద్ధమేనని నిరూపించుకుంటున్నారు.

ఖుర్బానీ ఇస్లాం ఆజ్ఞలలో ఒక ముఖ్యమయిన ఆజ్ఞ. దైవ ప్రవక్త ముహమ్మద్ (సఅసం) దీన్ని ఆదేశించారుః

"ఈ రోజు (బఖర్ ఈద్). మనం అన్నిటికంటే ముందు చేసే పని ఏమిటంటే, నమాజ్ చేయటం, తర్వాత ఇంటికి వెళ్ళి ఖుర్బానీ చేయడం" అన్నారు ఆయన.

ఖుర్బానీ కోసం పూర్తిగా ఒక సంవత్సరం నిండిన మేక లేక గొఱ్ఱె కావాలి. ఆవు, ఎద్దు, దున్నపోతు అయితే రెండు సంవత్సరాలకు తక్కువయినది కాకుండా ఉండాలి. ఒంటెకు ఐదు సంవత్సరాలు ఉండాలి. అంతకంటే తక్కువ వయస్సున్న పశువుల ఖుర్బాని కాదు. సులువుగా తిరగలేనంత బలహీనంగా, ముసలిగా ఉన్న పశువులను ఖుర్బానీ చేయటం భావ్యం కాదు.

కుంటిది, ఒంటి కంటిది, గ్రుడ్డిది, చెవులు తెగిన జంతువుల ఖుర్బానీ కూడా అవదు. మేక, గొఱ్ఱెలాంటివి ఒక్కో మనిషి తరఫున, ఒక్కో జంతువును ఖుర్బానీ చేయాలి. కాని ఆవు, గేదె లేక ఒంటె లాంటివయితే ఒక దాన్ని ఏడుగురు వ్యక్తుల తరఫున త్యాగ దానం చెయ్యవచ్చు.

ఖుర్బాని, ఈద్ నమాజ్ తర్వాత చేయాలి. నమాజ్‌కు ముందుగానే ఖుర్బానీ చేయకూడదు, పదవ తేదీన ఈద్ నమాజ్ తర్వాత పన్నెండవ తేది సూర్యాస్తమయానికి పూర్వంవరకు ఖుర్బానీ చేయవచ్చు. ఖుర్బానీ మాంసం పేదలకు పంచండి, బంధు మిత్రులకు ఇవ్వండి మీరూ తినండి.

ఈదుల్ అజ్‌హా (బఖర్ ఈద్) జిల్‌హజ్ నెలలో వస్తుంది. ఆ నెల తొమ్మిది తేదీన హజ్ అవుతుంది. పదో తేది పండుగ అవుతుంది. జిల్‌హజ్ తొమ్మిదో తేది ఫజ్ర్ నమాజ్ మొదలుకుని పదమూడో తేది అస్ర్ నమాజ్ వరకు ప్రతి ఫర్జ్ నమాజ్ అనంతరం 'తక్బీర్' చెప్పాలి. తక్బీర్ కాస్త బిగ్గరగా చెప్పాలి. తక్బీర్ పలుకులు క్రింద చూడండి.

**"అల్లాహు అక్బర్– అల్లాహు అక్బర్–లా ఇలాహ ఇల్లల్లాహు**
**వల్లాహు అక్బర్– అల్లాహు అక్బర్–వలిల్లాహిల్ హమ్‌ద్."**

అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, అల్లాహ్ అందరికంటే గొప్పవాడు. అల్లాహ్ తప్ప వేరే దైవం లేడు. అల్లాహ్ అందరి కంటే గొప్పవాడు. అల్లాహ్ అందరికంటే గొప్పవాడు. సమస్త స్తోత్రాలు అల్లాహ్ కొరకే.

## జనాజా నమాజ్

మనిషి చనిపోయిన తర్వాత అతని కొరకు అందరూకలిసి ప్రార్థన చేస్తారు. దాన్ని 'జనాజా నమాజ్' అంటారు. జనాజా నమాజ్ చేసే విధానం ఈ క్రింద తెలుపబడుతోంది.

మృత కళేబరానికి స్నానం చేయించి, పరిశుభ్రమయిన కఫన్

తొడిగి, సమాధి చేయటానికి సిద్ధపరచిన తర్వాత అందరూ ఖిబ్లా వైపుకు తిరిగి వరుసలు తీర్చి నిలబడాలి, వరుసలు మూడు, ఐదు లేక ఏడు (బేసి సంఖ్యలో) ఉండటం మంచిది. ఒకరు ఇమామ్ కావాలి. శవపేటిక ఇమామ్ ముందు ఉంచాలి. ఇమామ్ శవం ఛాతికి అభిముఖంగా ఖిబ్లా వైపునకు తిరిగి నిలబడాలి. తర్వాత 'దేవునికై నేను ఈ జనాజా నమాజ్ చేస్తున్నాను' అని సంకల్పం చేసుకోవాలి. అందరూ ఇదే విధంగా సంకల్పం చేసుకోవాలి. అయితే ఇమామ్, ఇమామ్ హోదాలో సంకల్పం చేస్తే మిగిలిన వారు ఆయన వెనుక నమాజ్ చేసే సంకల్పం చేయాలి.

ఇమామ్ బిగ్గరగా 'అల్లాహు అక్బర్' అని పలికి ఇతర నమాజుల్లో మాదిరిగానే చేతులు కట్టుకోవాలి. ఇప్పుడు ఇమామ్ ఆయన వెనుక ఉండేవారు ఎవరికివారు మౌనంగా 'సనా' పఠించాలి. తర్వాత ఇమామ్ బిగ్గరగా, మిగిలినవారు మెల్లగా అల్లాహు అక్బర్ అనాలి. ఆపై ఎవరికివారు ఇతర నమాజుల్లో మాదిరిగా 'దరూద్' పఠించాలి. తర్వాత ఇమామ్ బిగ్గరగా మిగతావాళ్ళు నెమ్మదిగాఅల్లాహు అక్బర్ అని చెప్పి ఈ క్రింది దుఆ చదవాలి.

> **"అల్లాహుమ్మగ్ ఫిర్‌లి హయ్యినా, వ మయ్యితినా, వ షాహిదినా, వ గాయిబినా, వ సగీరినా, వ కబీరినా, వ జకరినా, వ ఉన్సానా అల్లాహుమ్మ మన్ అహ్‌యైతహూ మిన్నా ఫ అహ్‌యిహీ అలల్ ఇస్లామ్.వమన్ తవఫ్ఫైతహూ మిన్నా ఫతవప్ఫహూ అలల్ ఈమాన్"**

"దేవా! మాలో బ్రతికి ఉన్నవారిని, చనిపోయినవారిని, ఇక్కడ హాజరయిన వారిని, హాజరు కాని వారిని, పిల్లలను, పెద్దలను, స్త్రీలను, పురుషులను, అందరినీ క్షమించు. దేవా! నీవు మాలో ఎవరినయితే సజీవంగా ఉంచుతున్నావో వారిని ఇస్లాం మార్గాన సజీవంగా ఉంచు; ఎవరినయితే మరణింపజేస్తున్నావో వారిని విశ్వాస స్థితిలో మరణింపజెయ్యి"

ఆ తర్వాత ఇమామ్ బిగ్గరగా, మిగిలిన వారు నెమ్మదిగా అల్లాహు అక్బర్ అని పలికి, అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహ్ అంటూ ముందు

కుడివైపునకు తర్వాత ఎడమవైపుకు ముఖం తిప్పి సలాం చెప్పాలి. జనాజా నమాజ్‌లో తక్బీర్‌లు తప్ప మిగతావన్నీ ఇమాం, ఇతరులు అంతా ఎవరికివారు వ్యక్తిగతంగా పఠించాలి.

## ఉపవాస వ్రతం

వేకువ ఝామున ఉషోదయానికి పూర్వం మొదలుకొని సాయంత్రం సూర్యాస్తమయం వరకు ఉపవాస సంకల్పంతో, తినటం, త్రాగటం, స్త్రీ పురుష సమాగమం మానేయటాన్ని 'ఉపవాసం' (రోజా) అంటారు.

పూర్తి సంవత్సరంలో నెల రోజులపాటు రమజాన్ మాసంలో ఉపవాసాలుండటం ప్రతి ముస్లిం స్త్రీ పురుషులకు ఫర్జ్‌గా నిర్ణయమయింది, అది ఫర్జ్‌కాదని తిరస్కరించినవాడు 'కాఫిర్' (అవిశ్వాసి) అవుతాడు. అనివార్య పరిస్థితుల్లో తప్ప ఉపవాసాలు వదలినవాడు మహాపరాధి అవుతాడు.

రమజాన్ ఉపవాసాలు పాటించకుండా ఉండటానికి అనుమతించ బడిన వారు కొందరున్నారుః-

1) ఉన్మాదావస్థలో ఉన్నవారు.

2) ఉపవాసం ఉంటే వ్యాధి అధికమయ్యే ప్రమాదమున్న వ్యాధిగ్రస్తులు.

3) ప్రయాణీకులు.

4) ఋతుస్రావం అవుతున్న లేక పురిటి రక్తస్రావం కొనసాగుతున్న స్త్రీలు.

కాని ఇలాంటి పరిస్థితుల్లో ఎన్ని ఉపవాసాలు కోల్పోతారో అన్ని ఉపవాసాలు అనివార్యస్థితి తొలగిన తర్వాత ఇతరదినాల్లో పూర్తి చేసుకోవడం అవసరం.

ఉపవాసం ఉండటానికి సంకల్పం చేసుకోవటం అవసరం. సంకల్పం చేయడమంటే మనస్సులో అనుకోవడమన్నమాట, దాన్ని నోటితో ఉచ్చరించినా మంచిదే. రమజాన్ ఉపవాసాలకు సంకల్పం రాత్రికే చేసుకోవాలి.

లేకపోతే, మధ్యాహ్నం వేళకు ముందే చేసుకోవాలి. ఉపవాసం కోసం వేకువజామునకు ముందే ఏదైనా కొంచెం తినటాన్ని 'సహ్‌రీ' అంటారు. సహ్‌రీ తినటం పుణ్యప్రదం. ఆకలి లేకపోయినా కొంచెమయినా తినాలి. లేకపోతే కనీసం మంచినీళ్ళయినా త్రాగాలి.

## పరిహారం

ఉపవాసం ఉండి దాన్ని భంగపరచడం మహాపాపం, తెలిసీ ఉపవాసం భంగం చేసినవాడు పరిహారం చెల్లించాలి. ఉపవాసభంగ పరిహారం రెండు నెలలు వరుసగా ఎడతెగకుండా ఉపవాసాలు పాటించడం. మధ్యలో ఏదైనా ఒకరోజు ఉపవాసం వదలినా మళ్ళీ మొదటినుంచి ఉపవాసాలుండటం ప్రారంభించాలి. ఒకవేళ అన్ని రోజులు ఉపవాసాలు ఉండటానికి శక్తిలేనట్లయితే అరవై మంది నిరుపేదలకు రెండు పూటలు కడుపునిండా తిండి పెట్టాలి.

ఉపవాస భంగం చేసినందువల్ల కజా రోజా (ఉపవాసానికి బదులు మరో ఉపవాసం వుండటం) పాటించడం, పరిహారం ఇవ్వటం-రెండూ అవసరమయ్యే పరిస్థితులు కొన్ని వున్నాయి. అవి ఏమనగాః-

1) తెలిసీ ఏదైనా తినటం.
2) తెలిసీ సంభోగం చేయడం.

కొన్ని పరిస్థితుల్లో ఉపవాసం భంగమవుతుంది. దానికి బదులుగా మరో ఉపవాసం ఉండడం అవసరం. అయితే అలాంటి స్థితిలో పరిహారం ఇవ్వనవసరం లేదు. ఆ పరిస్థితులు ఇవిః-

1) బలవంతంగా ఎవరైనా ఏదైనా తినిపించగా అది గొంతులో నుంచి లోనికి పోవటం.
2) ఉపవాసం వున్నట్లు జ్ఞాపకమున్నప్పటికీ పుక్కిలించేటప్పుడు పొరపాటున నీళ్ళు గొంతులోకి పోవటం.

3) రాయి, బొగ్గు, కాగితం, మట్టి వగైరా వంటివి తినదగని వస్తువు ఏదైనా మింగటం.

4) పొరపాటున బాగా తెల్లవారిన తర్వాత సహ్‌రీ తినటం లేక సూర్యాస్తమయం కాక ముందే ఇఫ్తార్ (ఉపవాస విరమణకై ఏదైనా తినటం) చేయటం.

ఒకవేళ ఉపవాసం వున్న విషయం మరచిపోయి ఏదైనా తింటే, త్రాగితే అది కడుపు నిండా అయినప్పటికీ ఉపవాసం మాత్రం భగ్నం కాదు. కాని గుర్తు వచ్చిన తర్వాత ఏదీ తినకూడదు. ఇక ఉపవాసం ఎటూ భగ్నం అయింది కదా అని తలచి తింటే మళ్ళీ ఆ ఉపవాసానికి బదులు మరో ఉపవాసం వుండవలసి వస్తుంది.

## నఫిల్ ఉపవాసం

రమజాన్‌లోనే గాక ఇతర దినాల్లో కూడా ఉపవాసాలు వుంటారు. వీటిని నఫిల్ ఉపవాసాలు అంటారు. నఫిల్ ఉపవాసాలకు ఎంతో పుణ్యం లభిస్తుంది. ఎవరైనా నఫిల్ ఉపవాసం వుండి దాన్ని భంగం చేస్తే దానికి బదులు తిరిగి మరో ఉపవాసం వుండవలసివస్తుంది. నఫిల్ ఉపవాసాలకు పరిహారం లేదు. సంవత్సరంలో ఐదు రోజులున్నాయి, ఆ రోజుల్లో నఫిల్ ఉపవాసాలుండటం కూడా నిషిద్ధమే. అవి :- (1) ఈదుల్ ఫిత్ర్ (2) ఈదుల్ అజ్‌హా, తర్వాత జిల్‌హజ్ నెల పదకొండు, పన్నెండు, పదమూడవ తేదీలు.

## జకాత్

ధనికులు తమ సంపదలో నుంచి ఒక నిర్ణీత భాగాన్ని ప్రతి యేడూ పేదల కోసం, నిరాధారులకోసం చెల్లించడం విధి, దాన్ని 'జకాత్' అంటారు. జకాత్ ఫర్జ్ (విధి) కాదని నిరాకరించినవాడు కాఫిర్ అవుతాడు. ఫర్జ్ అని తెలిసి కూడా దాన్ని చెల్లించనివాడు ఘోరాపరాధి.

## జకాత్ ఎవరిపై విధిగా నిర్ణయించబడింది?

ఎవరి వద్దనయితే నగదు రొఖ్ఖం రూపేణ లేక వ్యాపార సామగ్రి రూపేణ లేక వెండి బంగారం రూపేణ ధనముండి, అది ఏభై రెండున్నర తులాల వెండికి లేక ఏడున్నర తులాల బంగారానికి సమానమైన లేక వాటి కంటే అధిక విలువగలదిగా వున్నట్లయితే అలాంటి వారిపై జకాత్ చెల్లించడం ఫర్జ్ (విధి) అవుతుంది. మొత్తం ధనం నుండి రెండున్నర శాతం ధనాన్ని జకాత్‌గా చెల్లించాలి. పశుసంపద, పొలాలు, తోటల వుత్పత్తిపై కూడా జకాత్ చెల్లించవలసి వుంటుంది. దాని వివరాలను గురించి ఇతర పుస్తకాలలో చూసుకోండి లేక తెలిసినవారినడగండి.

## హజ్

హజ్ దినాలలో కాబాను సందర్శించడం, అరఫాత్ మైదానంలో నిలబడటం గొప్ప ఆరాధన. దాని పేరే 'హజ్'. కాబా వరకు పోయిరావటానికి ప్రయాణ ఖర్చులు భరించుకోగల ప్రతి ముస్లిం వ్యక్తి జీవితంలో కనీసం ఒక సారైనా హజ్ (కాబాయాత్ర) చేయటం ఫర్జ్ (విధి). హజ్ ఫర్జ్ కాదని నిరాకరించినవాడు కాఫిర్ (అవిశ్వాసి) అవుతాడు. రాను పోను ఖర్చులు భరించుకోగల స్తోమత వుండి కూడా కాబా యాత్రకు పోని వ్యక్తి ఘోరమయిన పాపం చేసినవాడవుతాడు.

హజ్ గురించిన ముఖ్య విషయాలు ఇతర పుస్తకాలలో చూసుకోండి, లేకపోతే తెలిసినవారినడగండి.



# సందేశం, ప్రచారం

ప్రవక్తల పరంపరలో అందరికంటే చివరన హజ్రత్ ముహమ్మద్ (సఅసం)ని దేవుడు ప్రవక్తగా నియమించి పంపిన విషయం మీరు చదివే వున్నారు. ఆయన తర్వాత ఇంకా ఏ ప్రవక్త కూడా రాడు. దేవుడు తన దాసుల కోసం తన ధర్మాన్ని ఆయన ద్వారా సంపూర్ణం గావించాడు. ఇక, ప్రళయం వరకు ప్రపంచ మానవులందరూ జీవితం గడపడానికి కావలసిన మార్గం ఇదొక్కటే. ఇందులోనే వారి శ్రేయముంది. మానవుడు తన నిజస్వామిని ప్రసన్నుడిగా చేసుకోగల మార్గం కూడా ఇదే. ఈ మార్గాన్నే అనుసరించి అతడు ఇహలోకంలోను, ఆ తర్వాత పరలోకంలోను నిజమైన సాఫల్యం పొందగలడు.

దైవ దాసులకు దైవ ధర్మాన్ని అందజేసే గురుతర బాధ్యత మొట్టమొదట ప్రవక్తల మీద మోపబడుతుంది. హజ్రత్ ముహమ్మద్(సఅసం)ను కూడా ఈ బాధ్యత అప్పగించే దేవుని తరపున పంపడం జరిగింది. ఆయన దైవాజ్ఞమేరకు దైవధర్మాన్ని ప్రజలకు అందజేశారు. దైవ ధర్మాన్ని స్వయంగా ఆయన అనుసరించి చూపారు. ఒక్కొక్క విషయాన్ని విస్పష్టంగా బోధించారు. ఆయన (సఅసం) తరువాత ఈ పనిని చెయ్యవలసింది, ఆయన తెచ్చిన ధర్మాన్ని విశ్వసించి, ఆయన చూపిన మార్గంపై నడచేవారు.

తోటి మానవులకు దైవ ధర్మాన్ని అందజేయటం ముస్లింల విద్యుక్త ధర్మం, ఒకవేళ ముస్లిములు తమ ఈ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చకపోతే

దాన్ని గురించి తీర్పు దినాన వారిని ప్రశ్నించడం జరుగుతుంది. దైవ ధర్మాన్ని వ్యాపింపజేయడం, దైవం పంపిన ఆదేశాలను ఆయన దాసులందరికీ అందజేయటం అనే కార్యాన్ని తబ్లీగ్ లేక ప్రచారం అంటారు. దీన్నే ధర్మసేవ అనంటారు. దాన్నే 'దావత్' లేక సందేశం అని అంటారు. అరబ్బీభాషలో ఎవరినయినా ఏదయినా పనికోసం పిలవటాన్ని దావత్ అని అంటారు.

ఈనాడు సందేశం, ప్రచారాలకు సంబంధించిన ఈ విధి నిర్వహణను నెరవేర్చడానికి ప్రతి ముస్లిం చేయవలసిన పనేమిటో తెలుసుకోండి. ఇంకా సాధ్యమైనంత వరకు ఆ పనిని పరిపూర్ణమయిన చిత్తశుద్ధితో చేస్తూ వుండండి.

1. మొట్టమొదట ఈ పనిని చేయాలి. ఎలాంటి పరిస్థితుల్లోనయినా సరే చేసి తీరాలి అని గట్టిగా మీరు నిర్ణయించుకోవాలి. ఏ పని చేయటానికైనా గట్టి సంకల్పం లేకపోతే మనిషి ఆ పనిని నిరంతరం చేస్తూ వుండలేడు, కొద్దిదైనప్పటికీ నిరంతరం చేసే సత్క్రియయే దేవునికి ఇష్టం. ఏపనయితే ఒకప్పుడు చేస్తూ మరొకప్పుడు మానివేస్తారో అది ఎన్నటికీ సత్ఫలితాన్నివ్వదు.

2. ఈ పనిని మొదట మీకు అత్యంత సన్నిహితులయినవారి నుంచి ప్రారంభించండి. మీ మాటకు విలువనిచ్చే మీ కంటే చిన్న వాళ్ళకు ప్రేమతో, వాత్సల్యంతో ధార్మిక విషయాలను బోధించండి. మీ మిత్రులకు, మీతో సమానమయిన వారికి కూడా తెలియజేయండి. వీలయితే నేర్పుగా మీ పెద్దలక్కూడా ఈ విషయాలు వినిపించండి. ఈ విధంగా ధార్మిక విషయాలను ఇతరులకు అందజేయటం వలన ఇతరులు ఎటూ ప్రయోజనం పొందుతారు, పోగా స్వయంగా మీకూ ఇందులో ప్రయోజనం వుంది. మీ జ్ఞానం అభివృద్ధి చెందుతుంది. మంచి విషయాలు మీ హృదయంలో నాటుకుంటాయి. మీరు చెడు విషయాలకు దూరంగా వుండటం మొదలెడతారు.

ఒకరికి మంచి పని చేయమని బోధించి స్వయంగా మీరు దాన్ని చెయ్యకుండా వుండటం అనేది ఎలా సాధ్యం?

3. ఎవరికయితే దైవ సందేశాన్ని అందజేయాలని మీరు నిర్ణయించుకుంటారో ముందు వారి హృదయాలను చూరగొనటానికి ప్రయత్నించండి. అందుకే ప్రజల సేవ చేయటం, వారితో ప్రేమ పూర్వకంగా మెలగటం గొప్ప పుణ్యకార్యాలని దేవుడు తెలియజేశాడు. ఈ సేవ, ప్రేమ పూరిత వైఖరి కోసం ఎవరు ముస్లిములో ఎవరు ముస్లిమేతరులో అని మీరు చూడకూడదు. దైవధర్మం కేవలం ముస్లింల కోసమే కాదు. అదయితే దైవం సృష్టించిన సమస్త మానవుల కోసం వచ్చింది. మీరు దాన్ని ఎవరెవరికి అందజేయగలరో వారందరికీ అందజేయాలి. మానవసానుభూతి అందరికీ వర్తిస్తుంది. ఈ విధంగా మానవ సేవ చేసే కొన్ని విధానాలు ఇక్కడ సూచిస్తున్నాము.

ఎవరైతే మీ పొరుగున ఉంటారో, వారు ముస్లిమ్‌లయినా, ముస్లిమేతరులయినా, మీరు వారితో సత్సంబంధాలు కలిగి ఉండాలి. అప్పుడప్పుడు మీరు వారి వద్దకు వెళ్ళాలి, వారిలో ఎవరయినా జబ్బుపడితే పరామర్శించడానికి వెళ్ళండి. మందులిప్పించటంలో, లేక మరేవిధమయిన పనుల్లోనయినా వారి ఇంటి వారికి వీలయినంతవరకు చేయూత నివ్వండి. బజారుకు వెళ్ళవలసిన పనుంటే ఆ పని చేసి పెట్టండి. మీరు అన్వేషణలో ఉంటే సేవ చేయటానికి మీకు ఎన్నో అవకాశాలు దొరుకుతాయి. ప్రతి మనిషి ఇతర మనిషి సహాయాన్ని కోరుతాడు, అంచేత ఇతరులకు మీ సహాయం ఎప్పుడవసరమవుతుందో తెలుసుకోవడం మీ పని.

మీ పొరుగులో ఎవరైనా నిరుపేదవాడు, నిరాధారుడు ఉండవచ్చు. అతని విషయంలో శ్రద్ధ చూపి సాధ్యమైనంత వరకు సహాయం చేస్తూ

ఉండండి. ఈ విధంగా ప్రేమ, సేవ ద్వారా మీ పెద్దలు, పిన్నలు, బంధు మిత్రుల హృదయాలను చూరగొనండి.

4. అన్నిటికంటే ముందు ప్రజల హృదయాలలో దేవునికి సంబంధించిన సరైన విశ్వాసం జ్ఞానం ఏర్పడేలా చూడాలి. ఆ తర్వాత పరలోక విశ్వాసాన్ని మనసులో నాటాలి. తన ప్రభువు సమక్షంలో నిలబడవలసి ఉందనే భావం లేనంతవరకు మనిషి చెడు మార్గాన్ని వదలిపెట్టి మంచి విషయాల వైపుకు రాలేడు.

ఈ విధంగా మెల్లమెల్లగా విశ్వసించవలసిన సమస్త విషయాలను ప్రజల హృదయాలలో నాటాలి. విశ్వాసం పటిష్టం కానంతవరకు మీరు ఏ పని కోసం కూడా ప్రజలను సమాయత్తపరచలేరు. ఒకవేళ మీ మాట తీసేయలేక ఎవరైనా రెండు రోజులు మీతో సహకరించి ఒక పని చేసినప్పటికీ వారు త్వరలోనే ఆ పనిని వదిలేస్తారు.

5. ప్రజలు ధార్మిక విషయాలు తెలుసుకునేందుకు వారిచేత పుస్తకాలు చదివించండి. లేకపోతే మీరే చదివి వినిపించండి. అర్థమయ్యేలా బోధపరచండి. ఈ పనికై ప్రజలను పిలిచి సమావేశాలు ఏర్పాటు చెయ్యాలి. సమావేశం వీలుపడకపోతే, ఒక్కొక్కరికైనా వినిపించండి. ప్రేమతో, ఆర్ద్రహృదయంతో ఏదైనా ఒక పనిని చేస్తూంటే మార్గం తప్పకుండా సుగమం అవుతుంది.

6. చెడును చెరిపేసి, మంచిని పెంచే పని అందరూ కలసిమెలసి చేయాలి, మీ ఊళ్ళో ఎవరైనా ఈ పని ముందే చేస్తూ ఉంటే వారితో సహకరించండి. ఎవరూ చేయకపోతే మీరొక్కరే చేయండి, ప్రయత్నిస్తే మీతో సహకరించే మిత్రులు దొరక్కపోరు.

7. కొంత మంది మీ మాటలు వినటం ప్రారంభించినప్పుడు, దైవాజ్ఞల్ని పాలించాలన్న ఆసక్తి వారిలో జనిస్తుంది. అప్పుడు మీరు మొదటి

వారిని నమాజ్ కొరకు సిద్ధపరిచేందుకు ప్రయత్నించండి.వారికి నమాజ్ పద్ధతి తెలీకపోతే నేర్పండి. కలిమా తెలియకపోతే అదీ నేర్పండి. నమాజ్, కలిమాలలో ఉన్న అర్థాన్నీ నేర్పండి. ఇలా మెల్లమెల్లిగా పని చేస్తూ ఉండండి.

8. ధార్మిక విషయాలు తెలియజేసి, అర్థమయ్యేలా బోధపరచిన తర్వాత కూడా ప్రజలు నిర్లక్ష్యవైఖరి అవలంబిస్తే మీరు నిస్పృహకు లోను కావద్దు. వారిని గురించి చెడుగా పలకవద్దు. ఇది ప్రశాంత మనస్సుతో చేయవలసిన పని. మీ పని మీరు చేస్తూనే ఉండండి. మీ పనికి తగిన ప్రతి ఫలం మీకు దేవుని వద్ద లభిస్తుంది. ప్రజలు మీ మాటలు విని తీరాలన్నదే మీ ధ్యేయం కాకూడదు. ఈ పని నిలకడగా అవుతుంది. ఎవరి దృష్టిలో దైవ ప్రసన్నత, పరలోక సాఫల్యం తప్ప మరొక విషయం ఉండదో వారే ఈ పని చేయగలుగుతారు.

9. ధర్మసేవ చేయాలని నిర్ణయించుకున్నప్పుడు మిమ్మల్ని మీరు బాగా పరిశీలించుకోండి. జాగ్రత్త! మీరు చేసే ఏ పని కూడా దైవాజ్ఞలకు వ్యతిరేకంగా ఉండకూడదు, ఈనాడు దైవ ధర్మం ప్రజల హృదయాలను ఆకట్టుకోలేక పోతుందంటే దానికి ముఖ్యమైన కారణం ముస్లింల జీవితాలు ఇస్లాంను ప్రతిబింబించేవిగా లేకపోవటమే. ఒకవేళ మీ జీవితంలో కూడా ఇలాంటిదేదైనా ఉంటే మీరు చెప్పే మాటలకు విలువ ఉండదు. ఎంత నష్టం కలిగినా, ఎన్ని లాభాలు మీ ముందు ప్రత్యక్షమైనా మీరు మాత్రం ఎన్నటికీ అసత్యం పలకకండి★ ఎవరినీ మోసగించవద్దు. పరోక్షంగా ఇతరుల

---

★ ఈ రోజుల్లో అబద్ధమాడకుండా తప్పించుకోవాలంటే మహా కష్టమయి పోయింది. అసలు విషయం ఏమంటే వారు ఇతరులకు చెప్పరానటువంటి పనులు చేస్తూంటారు. అంచేత ఒక తప్పును కప్పిపుచ్చడానికి పది అబద్ధాలు చెబుతుంటారు. రెండవ విషయం ఏమిటంటే ప్రజలు అత్యాశలకుపోయి చిన్న చిన్న ప్రయోజనాలకోసం కూడా అబద్ధమాడతారు. మీరు అబద్ధానికి

తప్పులెన్నడంలాంటి చెడుకు దూరంగా ఉండండి. లావాదేవీలలో నిజాయితీగా మెలగండి. దైవాజ్ఞలకు విరుద్ధమయిన కార్యకలాపాల్లో పాల్గొనకండి. నమాజ్ క్రమబద్ధంగా చేయండి, వీలయినంతవరకు ఉత్తమమయిన నమాజ్ చేయటానికి ప్రయత్నించండి.

10. ఈనాడు మన సమాజంలో అనేక చెడువిషయాలు దారి చేసుకొని సంప్రదాయాలుగా మారినందువల్ల ప్రజలు వాటిని చెడుగా కూడా భావించడంలేదు. అందుచేత మీరు వాటిని అతి జాగ్రత్తగా వడపోయవలసి ఉంది. అలాంటి విషయాలు మీరు మానుకోవలసి ఉంటుంది. దేవుడు, ఆయన ప్రవక్త (సఅసం) చెడు అని తెలిపిన ప్రతి విషయం, ఎలాంటి సంప్రదాయంగా మారినప్పటికీ మీరు దాన్ని చెడుగానే భావించాలి. అలాంటి విషయాలు కొన్ని ఇక్కడ గమనించండిః

వడ్డీ తీసుకోవడం, ఇవ్వటం, లాటరీ వేయటం, మట్కా, కార్నివాల్ అనే పేర్లతో జూదమాడటం, పజిల్ గళ్ళు నింపటం, సినిమాలు చూడటం, స్త్రీలు పరదా వ్యవస్థను పాటించకుండా తిరగడం, నగ్నస్త్రీల చిత్రాలతో ఇండ్లను అలంకరించుకోవటం, బ్లాక్ మార్కెట్ చేయటం, ప్రభుత్వ ఆస్తిని కాజేయటం, అమ్మకపు పన్ను, ఆదాయం పన్ను ఎగవేయటానికి బూటకపు రిజిష్టర్లు వ్రాయటం, ప్రతి చిన్న విషయానికి నిస్సంకోచంగా అబద్ధమాడటం ప్రమాణాలు చేయటం, టిక్కెట్లులేకుండా ప్రయాణం చేయటం, లంచమివ్వటం - తీసుకోవటం, న్యాయస్థానాలలో అబద్ధసాక్ష్యాలు ఇవ్వటం, పాలు, నెయ్యి మొదలయిన పదార్థాలలో కల్తీ చేయటం వగైరా.

---

దూరంగా ఉండాలని నిశ్చయించుకుంటే మొదట మీ జీవితం మొత్తాన్ని మార్చుకోవలసి ఉంది. మీరు అనేక పనులు మానుకోవలసి వస్తుంది, ఎదురుగా కన్పించే అనేక ప్రయోజనాలను వదలుకోవలసివస్తుంది కూడా.

11. ధర్మం పేరిట ఇస్లాంకు వ్యతిరేకమైన విషయాలెన్నో ముస్లింలలో వ్యాపించి ఉన్నాయి. వాటి విషయంలో కూడా మీరు నిజమేదో తెలుసుకుంటూ, తప్పుడు విషయాలకు ఎల్లప్పుడూ దూరంగా ఉండండి, మానవులను మోసగించటానికే షైతాన్ ధర్మాన్ని నాశనం చేసే పనులు చేయిస్తాడు. అలాంటి విషయాలలో కొన్ని ఇవిః-

1. సమాధుల వద్ద, పీర్ల వద్ద మొక్కుబడులు చేయడం.
2. అల్లాహ్‌ను వదిలేసి ఇతరుల పేరుతో మొక్కుకోవటం. సమాధుల ముందు సజ్దాచెయ్యడం, మొక్కుబడులు చేసుకొని వరాలు కోరుకోవటం.
3. ఉరుసు, తదితర సమావేశాల్లో పాల్గొని నాట్యం చూడటం, పాటలు వినటం.

(4) మరణం, వివాహం, జననం సందర్భాలలో ధర్మ విరుద్ధమయిన ఆచారాలను పాటించటం.

ఇలాంటి విషయాలలో మొదట మీరు బాగా తెలిసిన వారిని ఎవరినైనా అడిగి తెలుసుకోండి, తరువాత మీరు మరెలాంటి ఆచారాలనూ పాటించకండి.

ప్రజలనుండి ఇలాంటి దురాచారాలను మాన్పించటానికి ఎంతో నేర్పు, వివేచన ప్రయోగించవలసి ఉంటుంది. ప్రజలు వారంతటవారే ధర్మవిరుద్ధమైన విషయాలకు దూరంగా ఉండేలా వారి హృయాలలో దైవం, పరలోకం, దైవప్రవక్త (సఅసం) బోధనలకు సంబంధించిన నిజమయిన జ్ఞానాన్ని, విశ్వాసాన్ని జనింపజేయటానికి ప్రయత్నించండి; ముస్లింలలో ఉన్న దురాచారాలనే ముందుగా సంస్కరించాలని కూర్చున్న వారిని ప్రజలు రకరకాల చిక్కుల్లో పడేసి నిజమయిన ధర్మసేవా కార్యాన్ని చేయటానికి వీలు లేకుండా చేస్తారు. ఈ విషయంలో మీరు చాలా జాగ్రత్తగా మసలుకోవలసి

ఉంటుంది. అలాంటి చిన్న చిన్న దురాచారాలను దూరం చేసే చిక్కుపనుల్లో ఎన్నడూ పడకండి ఈనాటి ప్రాపంచిక మౌల్వీలు ఇలాంటి విషయాలలోనే పడి కొట్టుమిట్టాడుతుంటారు. ఆ పని వాళ్ళకే వదలివేయండి. ఒకవేళ ఎవరయినా మిమ్మల్ని అలాంటి విషయాల్లో ఇరికిస్తే మీరు వెంటనే ఆ ప్రసక్తిని ఆపేసి మాట ముందుకు సాగకుండా చూడండి. ధర్మకార్యం చేసేవారి దారిలో అడ్డంకులు వెయ్యటానికి ఈనాడు షైతాన్‌కు దొరికిన మహా అస్త్రం ఇదే. కనుక మీరు దీని విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి.

**"రబ్బనా తఖబ్బల్ మిన్నా ఇన్నక అన్తస్సమీ ఉల్ అలీమ్ వల్‌హమ్‌దులిల్లాహి రబ్బిల్ ఆలమీన్ వస్సలాతు వస్సలాము అలా రసూలి హిల్‌కరీమ్"**

ప్రభూ! మా సేవలను స్వీకరించు, నీవు అన్నీ వినేవాడవు అన్నీ తెలిసినవాడవు. సకల స్తోత్రాలు నిఖిల జగత్తుకు ప్రభువయిన అల్లాహ్ కొరకే. గొప్ప దైవప్రవక్త అయిన ముహమ్మద్‌పై శాంతి నెలకొను గాక!

